బా ల వ్యా క ర ణ

# సంజ్ఞాచంద్రిక

శ్రీమతి గూడపాటి కృష్ణకు

భాషా ప్రవీణ

ప్ర చు ర ణ :

న వ భా ర తి

లంకవీధి : విజయనగరం - 2



అంకితము:

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి దంపతులకు

గౌరవ పురస్సరముగా సమర్పితము

# శుభాశంస

చిరంజీవి కృష్ణకుమారి రచియించిన వ్యాకరణ సంజ్ఞలను విపులముగా ప్రదర్శించెడి 'సంజ్ఞా చంద్రిక' అను గ్రంథము ఆమూలాగ్రముగా చూచితిని. బాలవ్యాకరణము చదువుటకుముందు ఈ గ్రంథమును చదువుట చాల ఆవశ్యకము. చిన్నయసూరి అనేక శాస్త్రీయ పదార్థ విజ్ఞానము కలవాడు. ఆయన పాణినీయమున కృతభూరిపరిశ్రముడు. పాణినీయులు ఉపయోగించెడి పారిభాషిక పదములనే తానుపయోగించి చక్కని సూత్ర బంధముతో వ్యాకరణము నాంధ్రలోకమున కందజేసెను. వానిలో వర్తమానము, భానము, మున్నగు పదార్థముల నిర్వచనములు ఈ గ్రంథములో చక్కగా నిరూపింపబడినవి. ఈగ్రంథము చదువగా ఇంచుమించు బాలవ్యాకరణముయొక్క సూక్ష్మరూపము చదువరులకు జ్ఞాతము కాగలదు. ఇందు బాలవ్యాకరణము నందలివేకాక, సూత్రాంధ్ర వ్యాకరణము, శబ్దానుశాసనము, శబ్దలక్షణ సంగ్రహము, సిద్ధాంతకౌముది మున్నగు గ్రంథములలోని సిద్ధాంతములుకూడ ప్రామాణ్యమునకై చూపబడినవి.

ఈ గ్రంథమును చూడగా చిరంజీవి కృష్ణకుమారికి బహుగ్రంథద్రష్టృత్వము కలదని విజ్ఞులకు తోచకమానదు. ఈ గ్రంథరచన ప్రథమసోపానము వంటిది. దీనిని ఊతగాఁ జేసికొని బాల వ్యాకరణమునకు, ప్రౌఢ వ్యాకరణమునకుఁ బ్రత్యేకముగా, నన్నయ భట్టారకుని చింతామణికి పరిశీలనాత్మకమగు విపులముగా టీకలు వ్రాసి ఆంధ్రలోకమునకు

బహూపకారము కల్గించుటకై చిరంజీవికి ఆయురారోగ్య సౌభాగ్య సంపదలనిచ్చి శ్రీపతి బ్రోచుగాంత.

వ్యాకరణరత్న, వ్యాకరణ స్థాపక
ఉపనిషదర్థ వాచస్పతి
దర్శనాచార్య
**పేరి సూర్యనారాయణశాస్త్రి**
రాజమండ్రి
4–4–74

# ప రి తో ష ము

కుమారీ! కృష్ణా! నీవు పంపిన బాలవ్యాకరణ సంజ్ఞా పదార్థ వివరణము అందినది. విషయము చిన్నయసూరీ యముగదా యనియు, రచయిత్రి వేంకటకవినిబట్టి ప్రశిష్యు రాలయి స్వీయ విద్యాకుటుంబమునకుఁజెందిన కుమారిగదా యనియు, ఈ రెండు చూపులతో ఓపికలేకున్నను నీ వివర ణమును సాంతముగా పరికించితిని.

బాల వ్యాకరణమున సంజ్ఞలును సంజ్ఞాప్రాయము లును అయిన పెక్కు పదములను జాగురూకతతో వర్చి, సక్రమముగా కూర్చి వాని యర్థములను సుస్పష్టముగను సోదాహరణముగను ఈ తీరున విశదీకరించుట బాలవ్యాకర ణాధ్యేతలగు బాలురకు మిక్కిలి సౌలభ్యమును చేకూర్పఁ గలదు.

వ్యాకరణము నందలి క్లిష్ట పదములను ఇట్లు సమ కూర్చి వివరించు నూతన సంకల్పము నీకుఁగలుగుట నాకు మిక్కిలి సంతసము గూర్చినది. నీ వివరణము ఎక్కువ

తక్కువలు లేకుండ శాస్త్రదృష్టికి సమ్మతమయిన సరణిలో సాగినది. ఇట్టి విశదీకరణరేఖ నీబుద్ధిలో సహజమైయున్నది గావున; నీవు ఇంతటితో ఊరకుండక పదిమంది బాలురకు బాలవ్యాకరణము పాఠముచెప్పి నాసక్తిని తప్పక పెంపొందించుకొనవలయును. అధ్యాపన సందర్భమున స్ఫురించు సూక్ష్మాంశములు స్వయంపఠనమున స్ఫురింపనేరవు.

సూరిగారు చిరకాలము అధ్యాపక శిరోమణులు గావున ఆయధ్యాపనానుభవసాహాయ్యమువల్లనే, అన్ని విశేషాంశములతో, ఎన్నో సూక్ష్మ దృష్టులతో, ఎంతో రమణీయముగా ఎల్లవారును కన్నులకద్దుకొను సుప్రశస్త వ్యాకరణమును మనకందింపఁ గలిగినారు. అద్దానిని మనవారు గురువులయొద్ద భద్రముగా పఠించుటయు, వెంటనే పదిమందికి పాఠము చెప్పుటయు జరిగిన పక్షముననే అందలి విశేషముల నాకలించుకొని దాని ప్రశస్తిని మెఱయింపఁ గలుగుదురు.

ఇట్టి వివేచనచ్ఛాయ నీలోనున్నది గావున అధ్యాపన పరిశ్రమగూడఁ గావించి, మఱికొన్ని క్రొత్త రీతులలో సహితము నీవు సూరిగారి పలుకులకు మఱింత వైశద్యము నొదవింపఁగలుగుదువనియు, అది భాషా కృషికులగు బాలకులకును బాలికలకును మిక్కిలి యుపకారము కాఁగలదనియు నా విశ్వాసము.

తేజస్వినావధీతమస్తు

కళాప్రపూర్ణ, పుంభావ సరస్వతి

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

# ఆ ప్త వా క్య ము

పరిభాషాకల్పనం జ్ఞానప్రదమైన ప్రతి రంగానికీ చాలా అవశ్యకం. అందులోనూ వ్యాకరణం వంటి ప్రాయోగిక శాస్త్రానికి పరిభాష ఆయువుపట్టు వంటిది. అది నిర్దిష్టార్థాన్ని నిర్దుష్టంగా నిర్ద్వంద్వంగా నిష్కర్షించ సమర్థమై వుండటం ఎంతో అవసరం. పరవస్తు చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలో ఉపయుక్తమైన పరిభాషను తత్పరిచ్ఛేదానుక్రమంగా సంకలనంచేసి శాస్త్రీయమైన వివరణల్ని జోడించిన క్రోడం ప్రకృత గ్రంథం "సంజ్ఞాచంద్రిక".

ఏతత్కర్త్రి భాషాప్రవీణ శ్రీమతి కృష్ణకుమారి కళాప్రపూర్ణ శ్రీ కొండవీటి వెంకటకవి గురు చరణుల సన్నిధిలో శాస్త్ర సాహిత్యాలను ససిగా అధ్యయనం చేసిన విదుషీమణి. మా ఆప్తమిత్రులు, విజయనగరం మహారాజ సంస్కృత కళాశాలాధ్యాపకులు శ్రీగూడపాటి సాంబశివరావుగారి సతీమణి; చదివిన చదువుకూ, సంక్రమించిన సంస్కారానికీ సాధించిన వ్యుత్పత్తికీ సార్థకతను వెలార్చుటకై శ్రీమతి కృష్ణకుమారి కూర్చిన రచనమిది. కళాప్రపూర్ణ శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి మెచ్చుకోలునందిన రచనం అవటంచేత దీనికి ఇతర యోగ్యతా పత్రాలతో పనిలేదు.

సురుచిర వచశ్శ్రీ దాంపత్య విలసితమైన ఈ రచనం సంస్కారార్థ శ్రీకులును, సరస సాహితీభావుకులును అయిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తి దంపతులకు అంకితం అవటం సువర్ణానికి సువాసన అబ్బినట్టు.

వ్యాకరణాధ్యేతలకిది చక్కటి కరదీపిక కాగలదని ఆశిస్తున్నాను.

ఆంధ్రవిశ్వవిద్యాలయం — 'ఆచార్య' తూమాటి దోణప్ప

వాల్తేరు — 2—9—1974

# మా మా ట

సంక్షిప్తరూపమై సర్వత్ర ప్రవర్తమానమై శాస్త్రబోధకమగునది సంజ్ఞ. అంధకార బంధురమగు శాస్త్ర ప్రవేశమునకిది దివ్యజ్యోతి. ఇట్టి సంజ్ఞలనెల్ల నొకచో సంగ్రహించి సమగ్రమగు వివరణముగావించు కార్యమున కింతవఱకెవ్వరు పూనుకొనలేదు. ఇదంత తెలికపని కాక పోవుటచేతనో లేదా బహుగ్రంథ పరిశోధనా పరిశ్రమము ప్రతివారు ప్రారంభమునఁ గావింప వలయునని తలంచుటచేతనో కాని పెద్దలీ సుద్దిని దలఁపరైరి.

మా చి॥ సౌ॥ గూడపాటి కృష్ణకుమారి విద్యారంభ వేళనుండి సూరి సూత్రములవలె నియమోపేతగుణగణ సంపన్నయగుటచే, శుభ లక్షణలక్షితయగుటచే దురవగాహమగు నీ సంజ్ఞా వివరణమునకుఁ బూనుకొనినది. అనితర సాధ్యమగు నిమ్మహాకార్యమున నెంత వఱకుఁ గృతకృత్యయైనది తెలుపఁదగినది వైయాకరణ గణము.

మా కృష్ణకుమారి మగఁడు చిరంజీవి సాంబశివరావు మాకుఁ బ్రియ శిష్యుఁడు ఈ చిన్నారి దంపతులిరువురును నానాఁడు చేకూర్చు కొన్న విద్యా విభూతి విశేషమే ఈ సంజ్ఞా వివరణము. ఈ దంపతు లిరువురును మాకడఁ జదివిన వారగుటచే మేమింత కంటె వేఱేమి చెప్పిన చదురు కాదు. కాని సూరి పూర్వాపర రచనల కేకసూత్రత గల్పించి సూరిగారి వ్యాకరణ శూరత్వమును లోకమునఁ బ్రకటింప గోరుచున్నాను.

సుధీమిత్రులు, మానవతావాదులు, మా మిత్రులగు శ్రీ భాట్టము శ్రీరామమూర్తి దంపతులీ కృతిని స్వీకృతి గావించి ధన్యత చేకూర్చిరి.

నిడుబ్రోలు
30-9-74

కలాప్రపూర్ణ - కవిరాజు
కొండవీటి వేంకటకవి

# కృతజ్ఞతానివేదనము

పొన్నూరు శ్రీ భావనారాయణస్వామి ప్రాచ్య కళాశాలలో కళాప్రపూర్ణ శ్రీ కొండవీటి వేంకటకవిగారి యొద్ద వ్యాకరణ పాఠములు చదివెడి కాలమున ఈ గ్రంథమును వ్రాయు సంకల్పము కలిగినది. నేడు మావారి ప్రోత్సాహముతో ప్రకృత రచనము నీరూపమున సంతరింప గల్గితిని. నా యీ కృషి ఏపాటి ఫలించినను ధన్యాస్మి యని సంతసింతును.

కృతి స్వీకారమునకు దయతో అంగీకరించిన మాన్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి దంపతులకు; కవిరాజులు శ్రీ కొండవీటి వేంకటకవి గురుచరణులకు; ఏతత్కృతిని పరిశీలించి సూచనలను అభిప్రాయములను ఇచ్చిన సర్వశ్రీ కళాప్రపూర్ణ దువ్వూరి వేంకటరమణశాస్త్రి, వ్యాకరణరత్న పేరి సూర్యనారాయణశాస్త్రి, సాహిత్యాచార్య బుద్ధరాజు రామరాజు, ప్రొఫెసర్ తూమాటి దోణప్ప, డాక్టర్ లకంసాని చక్రధరరావుగార్లకును;

దీనిని సకాలములో ముద్రించి యిచ్చిన శారదా ముద్రణాలయాధినేతలగు శ్రీ దీవి భావనారుషిగారికిని, వారి సిబ్బందికిని, ప్రూఫులు సరిచూచిన చి॥ ఏల్చూరి వెంకట్రావు (భాషాప్రవీణ ఫైనల్) కును

నా కృతజ్ఞతాభివందనములు.

గూడపాటి కృష్ణకుమారి

# సంజ్ఞా సూచిక

— 0 —

# సంజ్ఞా చంద్రిక

## సంజ్ఞ :

"సంజ్ఞాకరణం వ్యవహారార్థం లోకే"

వక్ష్యమాణ విషయములను తేలికగా తెలిసికొనుటకు ఏర్పఱచిన సంగ్రహోక్తియే సంజ్ఞ. లోక వ్యవహారము కొఱకే సంజ్ఞలు కల్గింతురు.

## అచ్చులు:

"అకారాదు లచ్చులు"

అనిసూరి వివరణము. అనగా 'అ' మొదలు కొనివిసర్గము వఱకుఁగల అక్షరములు అచ్చులు. దీనినే తన పద్యాంధ్ర వ్యాకరణమున "ఆదులు పదాఱు స్వరములు" అని వివరించి నాఁడు. దీన అచ్చులు మొత్తము పదాఱు, వీనినేస్వరములు ప్రాణములని శబ్ద లక్షణ సంగ్రహమునఁ దెలిపెను.

స్వయముగా రాజిల్లునవి గాన వీనికి స్వరములను పేరు సార్థకమైనది. "స్వయం రాజన్తే స్వరాః" అని మ. భా. పా. ఈ స్వరములు అన్యవర్ణ సహాయత లేక ఉచ్చరింపఁబడునవి. అన్యవర్ణ సహాయతతో పలుకఁబడు

వ్యంజనమునకు ప్రాణము వంటిది కనుక ప్రాణమను సంజ్ఞయు సార్థకమైనది. హల్లులు అట్టివికావు. అచ్చుల యొక్క సంబంధములేనిది కేవల హల్లులు ఉచ్చరింపఁబడనేరవు.

కాక ఉదాత్త—అనుదాత్త—స్వరితములనునవి శాస్త్ర ప్రసిద్ధములగు స్వరములు. అట్టి స్వరములు కలవియగుటచే అచ్చులు కూడ స్వరములుగా పరిగణింపఁ బడుచున్నవి. ఈ యుదాత్తాది స్వరములు హల్లు యొక్క ధర్మములు కావు.

ఈ 'అచ్' అను సంజ్ఞ మన వర్ణ సమామ్నాయము వలన నేర్పడినది కాదు. మాహేశ్వర సూత్ర సిద్ధము.

ఉదా:— అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, లు. ఇవి అచ్సంజ్ఞకములు.

## హల్లులు:

"కకారాదులు హల్లులు"

అని సూరి వివరణము. ఈ హల్ సంజ్ఞయు, పాణినీయమే కాని తెలుఁగు సంజ్ఞకాదు. వీనికి "వ్యంజనములు, ప్రాణులు"అని పేరు. "హలః ప్రాణినః" అని సూత్రాంధ్ర వ్యాకరణమున "హల్లులు ప్రాణులు" అని శబ్దానుశాసన శబ్దలక్షణ సంగ్రహముల సూరి వ్రాయుచ్చెను. ప్రాణము

లచే పలుకఁబడు వ్యంజనములు కనుక వీనికి "ప్రాణుల"ను వ్యవహారము కలిగెను.

స్వరము ననుసరించునది "వ్యంజనము" "స్వయం రాజన్తే స్వరాః అన్వక్భవతి వ్యంజనమ్" అని మ. భా. షా. "పరేణ స్వరేణ వ్యజ్యత ఇతి వ్యంజనమ్" అనగా స్వరముచే స్పష్టము చేయఁబడు నది వ్యంజనము. ఇది స్వరావయవమే కాని స్వతంత్ర స్థితి కలది కాదు. ఏలయనః—"వ్యంజనమ్ స్వరాంగమ్ వ్యంజన సముదాయస్తు స్వర సంనిహిత ఏవ అక్షరంభవతి"— అని ఉవ్వట భాష్యము. అనఁగా స్వరమునకు సంనిహితమైన వ్యంజనస ముదాయమే అక్షరముగా చెప్పఁబడును. "కాదికములు ముప్పదియు నాల్గు వ్యంజనము లనఁదనరు" అని సూరి పద్యాంధ్ర వ్యాకరణమున ఈ వ్యంజనములు ముప్పది నాలుగు వర్ణములని స్పష్ట పఱిచెను. మఱియు వ్యనక్తి ఇతి వ్యంజనమ్, కర్తృ ప్రత్యయాంతము. అర్థమును స్పష్టపఱచునది యని యర్థము. హల్లులు లేక కేవలము అచ్చులను ప్రయోగించిన అర్థస్ఫూర్తి యేమి యుండదు.

ఉదాః— రాముఁడు. ఇందు మూఁడచ్చులు. మూఁడు హల్లులున్నవి. హల్లులను విడనాడి అచ్చులను ఉచ్చరించిన 'ఆ, ఉ, ఉ' దీని వలన నేమియు అర్థము భాసింపదు కనుక వ్యంజన మనునది అన్వర్థ సంజ్ఞము.

ఉదా:— క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ.' ఇయ్యవి హల్సంజ్ఞకములు.

# సంస్కృతము :

"సమ్ + కృత = సంస్కృత"

అనఁగా అంతటను సంస్కరింపఁబడినది. అనాది కాలములోనున్న వాడుక భాష లక్ష్మములచే సంస్కరింపఁ బడినది కనుక సంస్కృతమను పేరు కల్గినది. దీనికి "గీర్వాణ భాష, ఆది భాష" యని నామాంతరములు కలవు. ఆద్య ప్రకృతి యను నామాంతరము నన్నయ చింతామణి సిద్ధము. "సంస్కృతమునకు వర్ణము లేఁబది" అని సూరి నిర్ణయము గావించినాఁడు. ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది—అని శబ్ద లక్షణ సంగ్రహ సూత్రము.

ఉదా:— రామః—— రమా—— వనమ్—— శ్రీ—— ఇత్యాదులు. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః, క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ— ఇయ్యవి సంస్కృతమునకు వర్ణములు.

## ప్రాకృతము :

ప్రకృతి నుండి ఉత్పన్నమైనది ప్రాకృతము. ఇది ప్రాచీన వ్యవహార భాష. ప్రకృతి యన సంస్కృతము అని యర్థము. ప్రకృతి నుండి జనించినది కనుక ప్రాకృతమను పేరు కల్గినది. ప్రకృతి యన 'జనులు' అను అర్థము కూడ కలదు. జనుల వాడుక వలన కలిగిన భాష కనుక ప్రాకృతమను పేరు కలిగినదని చెప్పినను చెప్ప వచ్చును. ఈ భాష ఆఱు విధములు— "ప్రాకృతము—శౌరసేని—మాగధి—పైశాచి — చూళికాపైశాచి — అపభ్రంశము" — ఆయా దేశ నామములఁబట్టి వీనికి పేర్లు కలిగినవి. "ప్రాకృతమునకు వర్ణములు నలువది" అని సూరి చెప్పెను. "ద్వితీయంబునకు నలువది"— అని శ. ల. సంగ్రహములో ఈ ప్రాకృతమునే ద్వితీయమని వచించెను.

ఉదా:— అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఏ, ఓ, అం, అః. క, ఖ, గ, ఘ, చ, ఛ, జ, ఝ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, స, హ, ళ. ఇయ్యవి ప్రాకృతమునకు వర్ణములు.

## తెలుఁగు :

తద్భవములు, దేశ్యములు అచ్ఛికపదములుగా "సంస్కృత సమేతరంబయిన యీభాష యచ్ఛయనంబడు" నని సూరి నిర్ణయము. ఈ తద్భవ దేశ్యములే కాక తాప్ర,

కవర మొదలగు వర్గయుగక్షరములు, రోజు మొదలగు అన్యదేశ సంభవములగు పదములిందు మిక్కుటముగా కలిసి పోయినవి.

సంస్కృతభాష, ప్రాకృత భాష తెలుఁగుభాష యని యుండఁదగియున్నది. కాని సంస్కృతమునకు, ప్రాకృతము నకు తెలుఁగున కని విశేష్యపద రహితముగాఁ బ్రయోగించుట లోని సూరి యంతరార్థము గ్రహింప వలసియున్నది. ప్రారంభముననే నన్నయ మార్గావలంబ కుఁడు చిన్నయ యని మనకిది హెచ్చరిక.

## వక్రము—వక్రతమము :

"ఎ,ఏ,ఒ,ఓ, లు వక్రములని, ఐ,ఔ, లు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురని సూరివివరణ "ఏఙఖోవక్రః-వక్రతమఐచ్" అని నన్నయ వచించెను. సూరియుతనసంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమున "ఏఙ్వక్రః ఐజ్వక్రతమః "నియు; దీనినే తెలుఁగు పద్యాంధ్ర వ్యాకరణమున "ఏఙ్ వక్రమైచ్చు వక్రతమమని" యు స్పష్ట పఱిచెను. ఎ, ఏ, ఒ, ఓ లు వక్రములని, ఐ, ఔ, లు వక్రతమములని తన శబ్దాను శాసనమున శ. ల. సంగ్రహమున విపులీకరించెను.

లేఖనములో స్వల్పముగా వంకరయైన వర్ణములు కనుక వీనికి 'వక్రము' లను సంజ్ఞ సార్థకము. ఈ వక్రముల

కంటె మిక్కిలి వక్రత్వము కలిగి యుండుటచే "వక్రతమ ము"ను సంజ్ఞయు సార్థకమే." "తరప్ తమ పౌ అధికార్థ బోధకే" అని పాణినీయము. తరప్—తమప్‌లు అధికార్థ బోధకములని అర్థము గదా!

ఉదా:— ఎ, ఏ, ఒ, ఓ, లు వక్రములు ఐ, ఔ లు వక్రతమములు.

## పరుషములు :

"క చ ట త ప లు పరుషంబులు

గ జ డ ద బ లు సరళంబు" లని

చెప్పంబడునని సూరి సూత్రము. పరుషముగా పలుకఁబడునవి పరుషంబులు. ఇవి శ్వాస ప్రయత్నము కలవి. శ్వాసములు ఉచ్చారణకైనములు గదా. ఇవి కాది వర్గ పంచకములోని ప్రథమాక్షరములు "చయః పరుషాః" అని సూత్రాంధ్ర వ్యాకరణము నను—క చ ట త పాక్షరంబు లాఘు పరుషంబు" లని శబ్దాను శాసనమున దంత్య చకా రంబును గలిపి సూరి వ్రాసెను.

ఉదా:— క—చ—చ̄—ట—త—ప ఇవి పరుషాక్షరములు.

## సరళములు :

గ జ డ ద బ లు సరళంబులు.

అని సూరి "కచట తపాః పరుషాఖ్యాః గజడదబాస్తు సరళాః"అని చింతామణి. సరళమనఁగా ఋజువు, అవక్రమని అర్థములు. ఋజువుగా తేలికగా పలుకఁబడు నాదములే సరళములు. ఇవి కాది వర్గ పంచకములోని తృతీయాక్షర ములు. సూరి తన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమున "జశస్సరళాః" అని సూత్రించెను. 'జశ్' అనునది ప్రత్యా హారము జ, బ, గ, డ, ద, అను నవి ప్రత్యాహారములోని వర్ణములు. గ, జ, జ̄, డ, ద శాక్షరంబులాఖు సరళంబులని పద్యాంధ్ర వ్యాకరణమున గ, జ, డ, ద, బలు సరళంబులని శబ్దాను శాసనమున శబ్దలక్షణ సంగ్రహమున నిట్లే చెప్పెను.

ఉదా:— గ, జ, జ̄. డ, ద, బ ఇయ్యవి సరళములు.

## స్థిరములు :

'ఇతరములగు హల్లులు స్థిరములు'

అని సూరి సూత్రము. అనఁగా పరుష సరళముల కంటె భిన్నములైన వర్ణములు—స్థిరములు—అని అర్థము. పరుష సరళంబులు పరిణామ వర్ణములు. ద్రుతము పరమై నపుడు పరుషములు సరళములుగా మార్పు చెందుటగలదు. స్థిరములట్లు గావు. మార్పు చెందక అనఁగా సహజత్వమును గోల్పోక స్థిరముగా నుండునవి కనుక 'స్థిరము' లను—అన్వర్థ సంజ్ఞ నందినవి. "శేషాః స్థిరాః" అని సూత్రాంధ్ర వ్యాక

రణమునను, 'లాతి హల్లులు స్థిరముల'ని శబ్దానుశాసనమునను శ. ల. సంగ్రహమునను సూరి సూత్రించెను. పద్యాంధ్ర వ్యాకరణమున "వెలయు స్థిరములనఁగ వింత లిక్ష్వాది నాల్గు" అని స్పష్టపఱిచెను. 'స్థిరాఇతరే' అని చింతామణీయము.

ఉదా:— ఖ, ఘ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, ణ థ, ధ, న, ఫ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ, ఈ యిరువది నాల్గు స్థిర వర్ణములు. ఇవి ద్రుత పరకములఁగాని యెచటను మార్పునొందవు.

ఉదా:— మెఱసెను + ఖడ్గము = మెఱసెన్ఖడ్గము
ఇటు ద్రుత పరకమైనను స్థిర వర్ణమగు 'ఖ' సంధిలో నెట్టి మార్పు నందకున్నది,

## దంత్యములు :

"అ, ఆ, ఇ, ఈ, ఒ, ఓ లంగూడిన చజలు దంత్యంబులు" అని సూరి లక్ష్మము. అ, ఆ, ఉ, ఊ లతో గూడిన చజలు అచ్చ తెనుఁగు శబ్దములలో దంత్యము లగునని భావము. ఇవి సంస్కృత సమములలో పై అక్షరములతో కూడిన చజలు తాలవ్యములే యగును. చంద్రుడు—చామరము—చక్రిక—చూర్ణము—జయము—జాతి—జుగుప్స—జూటము మొ॥ నవి. 'దంతేభవమ్ దంత్యమ్'. దంతముల నుండి జనించినది దంత్యము. నాలుక దంతములకు తాఁకు

నట్లుగా పలుకఁబడు వర్ణములు దంత్యములు. సూ. వ్యా = అన్యత్ర తవర్గస్యః శ. శా = పెఱలు దంత్యంబులు. శబ్ద లక్షణ సంగ్రహమున "చ జ లసాంస్కృతికంబులు దంత్యంబులు" అని వాక్రుచ్చెను. సంస్కృత సంబంధులు గాని చజలు దంత్యములని భావము. ప. వ్యా. = "అత్వమాత్వముత్వంబూత్వమొత్వమోత్వమౌత్వమెనసిన చజలు దంత్యంబులు"— అని నుడివెను. "ఌతులసానాం దంతాః" అని పాణినీయులు. అనఁగా ఌ, త, థ, ద, ధ, న, ల, స లు దంత స్థానికములు. ఈ వర్ణములనుచ్చరించునపుడు నాలుక దంతములకు తాకుటచే దంత్యములని పేరు కల్గినది. ఈ సంజ్ఞ సంస్కృతమున లేదు. దంత్యచజౌ గురుకలౌచ బిందుయుతౌ" అని నన్నయ భట్టీయము. దంత్య చజలను గుర్తించుటకు వానిపై బిందువు నుంచవలెనని భావము. పూర్వ మీ దంత్యమును తెలుపుటకై తెలుఁగు ౨ అంకెను ఉంచెడివారు. దీని వలన రెండవచకారము, రెండవ జకారమని తెలియఁదగును. అనఁగా దంతముండ నక్కఱలేదు. దంతములు పోయినను దంత సంయుక్త దేశమున నాలుక తాకుటచే జనియించిన వర్ణములు దంత్యములు కాఁగలవు. అట్లు కాకున్న భగ్నదంతునకు తకారాది యుచ్చారణ సంభవింపక పోయెడిని.

ఉదా:— చలి—చాప—చుక్క—చూపు—చొక్కు—చోటు—చౌక
జముడు—జాతర—జున్ను—జాలు—జొన్న—జోలి—జౌకు.

## తాలవ్యములు :

"ఇ-ఈ-ఎ-ఏ లం గూడిన చజలు తాలవ్యంబులు" అని సూరి లక్షణము. "తాలౌ భవం తాలవ్యమ్" తాలువన గాడ యని యర్థము. దవుడ నుండి పుట్టినది తాలవ్యము. వర్ణముల నుచ్చరించునపుడు దవుడకు తాఁకి పలుకఁబడిన వర్ణములు తాలవ్యములు. "ఇచుయశానాంతాలూ" అని పాణినీయులు. అనఁగా ఇ, ఈ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శలు తాలు స్థానికములు. ఈ వర్ణములు దవుడకు తాకించి పలుకఁబడునవి కనుక వీనికిఁదాలవ్యమను పేరు కల్గినది. సూరి తన సూత్రాంధ్ర వ్యాకరణమున "చుర్ద్వ యోస్తాలవ్యః" అని, శబ్దానుశాసనము, శ. ల. సంగ్రహమున కూడ "ఇ ఈ ఎ ఏ లం గూడినవి తాలవ్యంబులు"— కొందఱు పదాది స్వర యోగంబునఁదొంటి యట్లుండు నండ్రు— అని విశదీకరించెను. సూ. వ్యాకరణమున "పెఱలు తాలుజములగుఁ దొలి యచ్చు దార్కొనంగ, బహుళముగఁబూర్వ వృత్తంబు వడయు శౌరి"—అని నుడివెను.

ఉదా:— చిలుక— చీమ—చెలి—చేమ

జిల—జీడి—జెట్టి—జేజే.

## సవర్ణము :

దంత్య తాలవ్యంబులైన చజలు సవర్ణంబులు" అను సూత్రమున సవర్ణ సంజ్ఞను సూరి విధించి యున్నాడు. "తాలవ్యచకారంబు దంత్య చకారంబునకును—తాలవ్య జకారంబు దంత్య జకారంబునకును గ్రాహకములని తాత్పర్యము" —అని వివరించినాడు. ఈ వివరణను బట్టి సంస్కృతమునందలి సవర్ణ సంజ్ఞ వంటిది కాదని తెలియుచున్నది. ఇచ్చటి సవర్ణము పరస్పర తుల్యతనే గోచరింపఁ జేయుచున్నది. అనఁగా దంత్య చజలు తాలవ్య చజల తుల్యములు. (దంత్య చకార జకారములు తాలవ్య చకార, జకారార్థముల నిచ్చునని భావము) ఇట్లే తాలవ్య చజలు, దంత్య చజల తుల్యములు. "ఉభయంబులు సవర్ణంబులు" అని శబ్ద లక్షణ సంగ్రహమున నుడివెను. సంస్కృతమున "తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్" 1—1—9 అని చెప్పఁబడినది. తాల్వాది స్థాన మాభ్యంతర ప్రయత్నశ్చేత్యేత ద్ద్వయం యస్య యేన తుల్యం తన్మిథః సవర్ణ సంజ్ఞంస్యాత్" అని వృత్తి. తాల్వాది స్థానము, అభ్యంతర ప్రయత్నమను నీ రెండును ఏ వర్ణమునకు ఏ వర్ణముతో సమానమో ఆ రెండును సవర్ణ సంజ్ఞకములగును.

తాల్వాది స్థానములు : కంఠము, తాలువు, ఓష్ఠము, మూర్ధము, దంతములు.

కంఠ్యములు:— అ, ఆ, క, ఖ, గ, ఘ, ఙ, హ.

తాలవ్యములు:— ఇ, ఈ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ

ఓష్ఠ్యములు:— ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ, ౘప

మూర్ధన్యములు:— ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష

దంత్యములు:— ఌ, ౡ, త, థ, ద, ధ, న, ల, స

ఆభ్యంతర ప్రయత్నములు:— స్పృష్ట — ఈషత్స్పృష్ట—సంవృత—వివృతములు

స్పృష్టములు:— 'క' నుండి 'మ' వఱకుఁగల అక్షరములు

ఈషత్స్పృష్టములు:— య-ర-ల-వ

సంవృతము— దండ, ఘట మున్నగు శబ్దములలోని హ్రస్వ అకారము.

వివృతము:— పదునాఱు స్వరములు-శషసహలు.

## ఉపధ :

"ఉపధ యనఁగాఁదుది వర్ణమునకు ముందు వర్ణము" అని సూరివివరణము. "అలోన్త్యాత్పూర్వ ఉపధా" 1-1-65 అని పాణినీయము. అనఁగా శబ్దము యొక్క చివర వర్ణమునకు ముందఱి వర్ణముపధ యనంబడును.

ఉదా:– అర్చి-(అర్ చ్ ఇ)-రోచి (ర్ + ఓ + చ్ + ఇ) ఇత్యాదులు. ఇందు 'ఇ' చివర వర్ణము. దాని ముందలి వర్ణమగు 'చ్' అనునది 'ఉపధ' యనంబడును.

## ద్రుతము:

"నకారంబు ద్రుతంబు"

అని సూరి లక్షణము. ఇతని పక్షమున స్వరసహిత నకారము ద్రుత మని తెలియు చున్నది. తన సూత్రాంధ్ర వ్యాకరణమున "విభక్త్యాగమచార్థోను ద్రుతః – ఆగమ విభక్తిటికాస్త చార్థోను ద్రుతః"–అని వివరించెను. అనఁగా ప్రత్యయాత్మకము-ఆగమాత్మకమును, ఇతర విధములును గల 'ను' ద్రుతమని అర్థము. పద్యాంధ్ర వ్యాకరణమున "నార్ణమునకు ద్రుత మాఖ్యయొప్పు" అని చెప్పెను. 'ద్రుతాఖ్యో నః' అని చింతామణి. ఇతని పక్షమున పొల్లు నకారము ద్రుతము. శబ్దానుశాసనమున, శబ్ద లక్షణ సంగ్రహమునను 'నకారంబు ద్రుతంబ'నియే కలదు.

"ద్రుతః పుంసి......త్రి. జాత ద్రవీభావేఘృత సువర్ణాదౌ" అను శబ్దార్థ చింతామణి వాక్యము. దీని వలన శబ్దములయందును 'ఒల్లని యెడ ద్రుతి నొందు (మఱుఁగుపడు) స్వభావము గల నకారము ద్రుతము" అని తెలియు చున్నది. శబ్దాంతములందలి న్-ను-ని వర్ణములను అవసాన సూత్రములచే లోపింపఁజేసి స్పష్టాస్పష్టముగ నుంచి

నను ఎచ్చట అర్థమునకు భంగము వాటిల్లదో ఆ న్-ను-ని వర్ణములు ద్రుతములు.

ఉదా:— వచ్చుచున్—చేయును—హరికిని ఇత్యాదులు. వీనిలో ద్రుతము లోపించినను తదర్థమునకు భంగము వాటిల్లదు.

## ద్రుతప్రకృతికములు:

"ద్రుతాంతములైన పదములు ద్రుత ప్రకృతికంబులు" అని చిన్నయ సూరి సూత్రము. పదంబు నాంతంబు ద్రుత ప్రకృతికము' అని శబ్దానుశాసనము, పద్యాంధ్ర వ్యాకరణము. "తదన్తం ద్రుతప్రకృతికమ్" అని సూత్రాంధ్ర వ్యాకరణమునను, "పదంబు ద్రుతాంతంబు ద్రుత ప్రకృతికంబని" శబ్దలక్షణ సంగ్రహమునను వచించెను. నకారము తుదిగా గల పదములు ద్రుత ప్రకృతికములని యర్థము. 'నుక్' అనునది పదాంతమున వచ్చును కనుక అదియు ద్రుత ప్రకృతికమే. ప్రథమా కయి పట్టి మొక్కేతరములైన విభక్తులు, ఉత్తమ పురుషైక వచనంబులు, భూత తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనములు. ఆశీరాద్యర్థకంబులయిన యెడు, తవర్ణకంబులు శతృతుమూనంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులు వలె ప్రభృతులును ద్రుతప్రకృతికములని చెప్పినాడు.

## కళలు :

"ద్రుత ప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు"

అని సూరి లక్షణము. కళ అనఁగా భాగము—పాలు—అంశమని యర్థములు. ద్రుతము చివరలేని పదములు కళలని యర్థము. "తిఙ్మధ్య శేష షష్ఠీ సుసంకర్మ ప్రవచనీయ జవిభక్తిః కించిత్ప్ర శంస నాద్భుత యదా తదాకిమే వాంశ్చ" ఇవి చింతామణిలో పేర్కొనిన కళలు. నన్నయ కళలను చెప్పిన పిమ్మట ద్రుత ప్రకృతికములను జెప్పెను. చిన్నయ ద్రుత ప్రకృతికములను చెప్పి ఆ తరువాత కళలను జెప్పెను. తెలుఁగున ద్రుతాంత పదములు మిక్కుటముగాఁగానఁబడుటయే కారణమేమో! "వలసినచోఁ గడ ద్రుతములు, దల సూపని పదము తెల్లఁదగుఁగళలన" అని పద్యాంధ్ర వ్యాకరణము. "అన్యత్కళా" అని సూత్రాంధ్ర వ్యాకరణంబునను, అన్యంబు కళయని శబ్దానుశాసనమునను చెప్పెను. ద్రుత ప్రకృతికముల కంటే ఇతరములైనవి 'కళ' లని భావము.

## హ్రస్వము :

"ఏక మాత్రో భవేద్ధ్రస్వః—అని శిక్షావచనము"

ఒక మాత్ర కాలములో పలుకఁబడు స్వరము హ్రస్వము. మాత్రయనఁగా ఒక సెకండులో నయిదవ

భాగపు కాలము 'అ' ఇది ఏక మాత్రా కాలములో నుచ్చరింపఁబడును. ఈ హ్రస్వమును ఛందశ్శాస్త్రములో లఘువుగాఁ బరిగణింతురు. 'హ్రస్వంలఘు' 1—4—10 హ్రస్వం లఘు సంజ్ఞంస్యాత్"—అని పాణినీయులు.

ఉదా:— రామ; కృష్ణ;

రామలోని 'మ' హ్రస్వము. ఇదియే లఘువు. ఏక మాత్రగలది.

ఈ హ్రస్వ విధిని ఆయా సూత్రముల వలనఁ దెలియఁ జేసెను. హ్రస్వము మీఁది ఖండ బిందువునకుఁ బూర్ణ బిందువు వైకల్పికముగనగు. అనఁటులు — అనంటులు. ఇత్యాదులు హ్రస్వ ఘటితములు.

## దీర్ఘము :

"ద్వి మాత్రో దీర్ఘ ఉచ్యతే" అని శిక్షావచనము. రెండు మాత్రల కాలములో పలుకఁబడు స్వరము దీర్ఘము. 'ఆ' ఇది రెండు మాత్రల కాలములో పలుకఁబడినది. ఈ దీర్ఘమును గురువుగాఁ బరిగణింతురు. 'దీర్ఘంచ' 1—4—12 దీర్ఘంచ గురుసంజ్ఞంస్యాత్" అని పాణిని—అనఁగా దీర్ఘాక్షరము స్వతంత్రముగా గురునను సంజ్ఞ కలది యగునని యర్థము.

చిన్నయ "దీర్ఘము మీఁద సాధ్యపూర్ణము లేదు" అని దీర్ఘ సంజ్ఞ నుపయోగించుకొనెను గాని నిర్వచింపలేదు.

ఉదా:- వాఁడు-వీఁడు-రాఁడు-లేఁడు ఇత్యాదులు.
వీనిలోని మొదటి అక్షరములు దీర్ఘాక్షరములు.

## ప్లుతము :

"దూరాహ్వానే ప్లుతః" అని సూత్రాంధ్ర వ్యాకరణము. దూరాహ్వానము నందు ప్లుతమగునని యర్థము. "త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః" మూఁడు మాత్రల కాలము నందు చెప్పఁబడు ప్రాణము ప్లుతము. ఇది త్రిమాత్రక మని గ్రహించుటకై ఆవర్ణము పైభాగమున 3 అను సంఖ్యను లిఖింతురు.

"ఉదంతసంస్కృతనామంబులమీఁది సంబుద్ధి హ్రజనను నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు" అని చిన్నయ సూత్రము.

ఉదా:- ఓ విష్ణు 3, ఓ శంభు 3

పై ఉదాహరణములు ప్లుత సంజ్ఞకములని తెలిసి కొనుటకై '3' అనునది ఉంచఁబడినది. అయితే ఈప్లుత ప్రయోజనము తెలుఁగు భాషలో నంతగా లేదు. ఊకాలోऽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః 1—2—27 అని పాణినీయము. "వాంకాల ఇవకాలో యస్య సోऽచ్ క్రమాత్ హ్రస్వ దీర్ఘ ప్లుత సంజ్ఞః స్యాత్" —అని వృత్తికారుని వచనము. 'వాం' అనునది ఊకారము యొక్క షష్ఠీ బహువచనము. అనఁగా

ఉ, ఊ, ఊ3 అను అక్షరముల యొక్క కాలము వంటి కాలము ఏ అచ్చునకు కలదో అది హ్రస్వ దీర్ఘ ప్లుతసంజ్ఞల నందును. అనఁగా 'ఉ' కారముసుచ్చరించుటకు పట్టు కాలమున ఉచ్చరిత మగు నచ్చు హ్రస్వమనియు, ఊకారమును ఉచ్చరించుటకు పట్టు కాలమున పలుకఁబడు అచ్చు దీర్ఘమనియు, ఊ3 కారమును పలుకుటకు పట్టు కాలమున చెప్పఁబడునచ్చు ప్లుతమనియు చెప్పనగును. ఛందశ్శాస్త్రములో "ప్లుతయతియందు,సంబోధనములో దూరాహ్వానము నందు మాత్రమే దీని ప్రయోజనము.

## లఘువు :

"య ర ల వ లు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు" అని చిన్నయ లక్ష్మము. అంతస్థములగు య, ర, ల, వలు లఘువులని యర్థము. "లఘువోఽలఘవశ్చేతి ద్వేధాఽంతః స్థాన్ వదన్తి శాస్త్రారః"అని నన్నయ భట్టీయము. అనఁగా అంతస్థములను లఘువులు, అలఘువులని ద్వివిధములుగా శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారని యర్థము.

తేలికగాఁ బలుకఁబడు వర్ణము లఘువు. సంస్కృత వ్యాకరణమున ఈ సంజ్ఞను గూర్చి "యస్య ఉచ్చారణే జిహ్వాగ్ర ఉపాగ్ర మధ్య మూలానాం శైథిల్యం జాయతే సలఘూచ్చారణః"అని సిద్ధాన్త కౌముదిలో భట్టోజిదీక్షితవచనము. దేనిని ఉచ్చరించునపుడు నాలుక యొక్క అగ్రభాగము,

తత్సమీప భాగము, మధ్య భాగము, మూల భాగములు శిథిలములుగా నుండునో ఆ వర్ణము లఘువనఁబడునని యర్థము.

ఉదా:— హరి + అతఁడు = హరియతఁడు—ఇత్యాదులందాగమ యకారము లఘువు.

పెరుగు—కరుగు ఇత్యాదులందు రేఫంబు లఘువు.

తల—నెల ఇత్యాదులందలి లకారము లఘువు.

అతడు + పలికె = అతడు వలికె నిత్యాదులందున్న వాదేశ వకారము లఘువు.

## అలఘువు :

"యరలవలు — అలఘువులు" నైతముగునని చిన్నయ నిర్వచనము. యరలవలకు లఘు సంజ్ఞతో పాటు అలఘువను సంజ్ఞ కూడ కలదని యర్థము. తేలికగా ఉచ్చరింపఁబడనివి అలఘువులు. అనఁగా దృఢముగా పలుకఁబడునవి అలఘు సంజ్ఞకములని యర్థము. "అంతస్థంబులు లఘువులు- అలఘువులు నాద్వివిధంబులగు" నని శబ్ద లక్షణ సంగ్రహము నందలి సూత్రము.

ఉదా:— కాయ, చాయ, నేయు — ఇత్యాదులందున్న స్వతస్సిద్ధ యకార మలఘువు.

విఱుగు—మెఱుగు ఇద్యాదులందున్న రేఫము అలఘువు.

ఏకులు (ఏదు + లు) పాకులు (పాలు + లు) త్రాకులు (త్రాడు + లు)
ఇత్యాదులలో బహుత్వమందు రలడల కాదేశమయిన కకార మలఘువు.

వంకాయ — వంక ఇత్యాదులందున్న సహజ వకారము అలఘువు.

## అంతస్థములు :

"య ర ల వాః అంతస్థాః" అని శిక్షావచనము.

య ర ల వ ల కు అంతస్థములని పేరు. కాదులగు స్పర్శలకు, ఊష్మములగు శ ష స ల కు మధ్య నుండు వర్ణములగుటచే అంతస్థములని సార్థక నామమును బడసిన వని కొందఱ అభిప్రాయము. "స్పర్శోష్మాణాం అన్తః మధ్యే తిష్ఠన్తీతి అన్తః స్థాః" అని ఉవ్వట భాష్యము. "స్వస్యస్వస్యస్థానస్య అన్తే తిష్ఠన్తీతి అంతస్థాః" ఏవం యకారాదీనాం చతుర్ణాం కరణాంత వ్యాపార నిష్పాదత్వాద న్తస్థా ఇత్యాఖ్యా—

ఉదా:— య-ర-ల-వ

ఈ నాల్గింటికి అంతస్థములని పేరు.

## తత్సమము :

"సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాషతత్సమంబు" అని చిన్నయ సూత్రము. సంస్కృత ప్రాకృత ప్రకృ మా

ద్వితీయైక వచనాంతముల ప్రాతిపదికములుగాఁగొని తెనుఁగు వ్యాకరణ ప్రకారము గావించిన పదములు తత్సమములు. అనఁగా సంస్కృత పదముల తుది నున్న దీర్ఘమును హ్రస్వము గను, ప్రథమా విభక్తి లోపమును, కొన్నిచోట్ల ద్విత్వోత్వములను, కొన్ని చోట్ల అన్లు గ్రహించుటవలనను తత్సమ పదముల గుర్తింప వచ్చును. అన్లు ప్రాకృత తత్సమములను కూడ గ్రహింప వచ్చును. "సంస్కృత ప్రాకృతములు ప్రకృతులు—ప్రకృతి ద్వయ తుల్యంబు తత్సమంబు" అని శబ్ద లక్షణసంగ్రహమున కూడ వ్రాయుచ్చెను. కేతనాదులు సంస్కృతమునే కైక ప్రకృతిగా భావించి ప్రాకృతాదులను విస్మరించిరి.

ఉదా:— విద్యా = ఇది సంస్కృత పదము. "నామంబుల తుది దీర్ఘమునకు హ్రస్వంబగు" అని తెలుఁగు వ్యాకరణ ప్రకారము హ్రస్వము చేయగా వచ్చిన 'విద్య' అనునది తత్సమము. హరి = 'ఇత్తురా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు' అను దానిచే ప్రథమా విభక్తి లోపము కల్గిన తత్సమ పదము. రుక్కు = రుక్ అను హలంతమునకు "ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లునకగు" అనుదానిచే ఉగాగమద్విత్వములు గల్గిన రూపము. భువి = ఇది సంస్కృతమున సప్తమీ విభక్త్యేక వచనపదము. ఇది తెలుఁగున అన్తు గ్రహింపఁబడినది. 'భూదివోస్తు జాయత్తత్' అని నన్నయార్యుడు రూపముల సాధువా

నర్చెను. సూరి ఇట్టి రూపముల నిపతించిమాపెను. (తుల్యాతు సమా—అని చింతామణీయము- "సంస్కృత ప్రాకృతే ప్రకృతి" అని చిన్నయ సూత్రాంధ్ర వ్యాకరణము) అగ్నిః-అగ్గి-అగ్గి; అగ్గి యనునది ప్రాకృత రూపముతో సమానముగ నుండుటచే ప్రాకృత సమము.

## తద్భవము :

"సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" అని సూరి లక్ష్యము. సంస్కృత ప్రాకృతముల నుండిపుట్టినవి తద్భవములు. వీనికి వికృతి పదములనియు పేరు. "ఏషా వికృతిః" అని సూరి సూత్రాంధ్ర వ్యాకరణమునను, "ప్రకృతంబు తద్భవంబు" అని శబ్దానుశాసనమునను గలదు. "త్ప్రకృతంబు తద్భవంబు" అని శబ్ద లక్షణ సంగ్రహము నను గలదు. దీనికి పై సూత్రములో చెప్పిన ప్రకృతిద్వయము అనునది ఈ సూత్రములోని తత్ అను దానికి అర్థము. అనఁగా ప్రకృతి ద్వయ జాతంబు తద్భవంబని యర్థము. "ప్రకృతి ద్వయజాతజ్ఞా" అని నన్నయ భట్టీయము. సంస్కృత ప్రాకృత పదములు వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశ వర్ణ వ్యత్యయములచే పరిణతి నొంది తద్భవములని వ్యవహరింపఁబడు చున్నవి.

i) వర్ణలోపము:- తామరసమ్—తామర. 'సమ్' అనునది లోపించి 'తామర' అని తద్భవరూపము నొందినది.

**ii)** వర్ణాగమము:- రథః—అరదము. అవర్ణము ఆగమముగా వచ్చి తద్భవమైనది.

**iii)** వర్ణాదేశము:- ఆకాశః — ఆకసము. ఇట 'కా' కు 'క' వర్ణమును 'శ' కు 'స' వర్ణమును ఆదేశముగా వచ్చి తద్భవమైనది.

**iv)** వర్ణవ్యత్యయము:- శుచిః —చిచ్చు. శుచిలోని రెండవ అక్షరము మొదటి వర్ణముగ వ్యత్యయము చెంది "చిచ్చు" ఐనది.

## దేశ్యము :

"త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యము"

అని సూరి సూత్రము. అనఁగా శ్రీ శైల దాక్షారామ కాళేశ్వరములు గల దేశములో జనవ్యవహారము వలన సిద్ధమైన భాష దేశ్యమని యర్థము. "దేశేభవమ్ దేశ్యమ్"అనఁగా ఆయాదేశంబులందు జనించిన భాష దేశ్యమని యర్థము. 'ప్రవాహినీ దేశ్యా' అని చింతామణి. దేశ్యం ఆర్షంచ రూఢత్వాత్ స్వతంత్రత్వాచ్చ భూయసా లక్ష్మనాపేక్షతే తస్య సంప్రదాయోహిబోధకః- దేశ్యము, ఆర్షమునగు వ్యవహారము రూఢమై యుండుట వలనను స్వతంత్రముగాఁబ్రయోగింపఁబడి యుండుట వలనను లక్షణ రచనను అపేక్షింపదు. ఏలయన వానికి సంప్రదాయమే

బోధకమగును. "ప్రవాహ సిద్ధంబు దేశ్యంబు" అని శబ్దానుశాసనమునను, శబ్దలక్షణ సంగ్రహమునను సూరి సూత్రించినాడు-

ఉదా:- ఊరు-పేరు-ఇల్లు-ముల్లు-కోట-పేట-
దూడ-మేడ-కోఁత-లేఁత-తావి-మోవి - మొదలగునవి.
ఇవి ఆయా దేశ వ్యవహారసిద్ధములైనవి కనుక దేశ్యములు.

## గ్రామ్యము :

"లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు"

అని లక్షణము. విరుద్ధంబు గ్రామ్యంబని శబ్ద శాసనమునను, శ. ల. సంగ్రహమునను గలదు. వ్యాకరణ శాస్త్ర విరుద్ధమైనది గ్రామ్యమని యర్థము. 'అనియమాత్ గ్రామ్యం హి' అని చింతామణి నిర్వచనము. అనఁగా అశాస్త్రీయమైనది గ్రామ్యమని అర్థము. పామరాది ప్రయుక్తం య "ద్గ్రామ్య మభిధీయతే" గ్రామేభవం గ్రామ్యమ్. లక్షణ విరుద్ధమైన ఈ గ్రామ్యమును పెద్దలు వ్యవహరించినచో గ్రహింపనగునని "ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు"అని సూరి సూత్రించెను. విరుద్ధంబు గ్రామ్యంబు అని శబ్దానుశాసనము.

ఉదా:- వస్తాఁడు-తెస్తాఁడు-వచ్చేని-తెచ్చేని-వచ్చేటివాఁడు తెచ్చేటి వాఁడు-వచ్చేవాఁడు-తెచ్చేవాడు మొ॥ వి॥

## సంధి :

"పూర్వ పర స్వరంబులకు పరస్వరంబే
కా దేశంబగుట సంధి యనంబడు"

నని సూరి నిర్వచనము. పూర్వపద మందలియంత్య స్వర మునకును పరపదమందలి యాదిస్వరమునకును బదులుగా పర పద మందలి యాది స్వరమువచ్చుటయే'సంధి'యని యర్థము. 'అన్త్యాన్త వర్ణ యోరైక్యం సంధి రిత్యుచ్యతేబుధైః" పూర్వస్య పర రూపత్వం అత్రైవ నియతం భవేత్" అను వికృతివివేక కారిక దీనికి మూలము. పూర్వపదాంత్య పరపదాది వర్ణ ముల యైక్యమే సంధియని పండితులు వచించిరనియు, ఈ తెలుగులో పూర్వపదాంత్య పరపదాది వర్ణములకు పర రూపము వచ్చుటయే నియతమనియు పై కారికార్థము.

ఈ సంధినే సంస్కృత వైయాకరణులు 'సంహిత' అనిరి. 'సంహితాయామ్' 6–1–72 అని అధికారసూత్రము. "పరస్సన్నికర్షః సంహితా" 1-4-109 వర్ణానామతిశయితః సన్నిధిః సంహితా సంజ్ఞః స్యాత్ అని పాణినీయులు. వర్ణ ములకు మిక్కిలి సామీప్యము (సన్నిధానము) సంహితా సంజ్ఞక మగునని యర్థము. ఇట్టి సంహిత కల్గిన చోట సంధి కార్యములు కల్గును.

"సంహితైక పదేనిత్యా నిత్యాధాతూప సర్గయోః
నిత్యా సమాసే వాక్యేతుసా వివక్షామ పేక్షతే॥
భర్తృహరి

అనఁగా ఒకే పదమునందు సంహిత నిత్యము. ధాతువులకు ఉపసర్గలతో గూడ సంహిత నిత్యమే. సమాసమునందును నిత్యసంహిత, యే వాక్యమందైన సంహిత వివక్షను బట్టియేర్పడును. "పదాంత పదాద్యోః సంధిః"-అని సిద్ధాంత కౌముది.

పూర్వపదమజంతమై పరపదమజాదియగుచో నీ లక్షణము సమన్వయమగును. కానిచో నీ లక్షణముకుదురదు. కాని చిన్నయ సూరి సంధి పరిచ్ఛేదమున సంధి శబ్దము పదునొకండు సూత్రముల యందే యుపయోగించెను. ఈ లక్షణము వీనికి మాత్రమే పట్టును. ఇఁక యడాగమ, టుగాగమ, రుగాగమ, నుగాగమాదులెల్ల నీ లక్షణమునకు వెలియైనను ముగ్ధబోధ వ్యాకరణాను సారము పరచ్ఛేద పఠనము వలన సంధి శబ్ద వాచ్యములైనవి.

ఉదా:— రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు

ఇట పూర్వ పదాంత్య వర్ణమగు 'డు' లోని 'ఉ' కును, పరపదాది వర్ణమగు 'అ' కును బదులుగా పరపదాది వర్ణమగు 'అ' ఏకాదేశముగా వచ్చి రాముఁడతఁడు-అయినది. మా + అమ్మ = ఇట వర్ణాధిక్యముగా యడాగమము వచ్చి మా య్‌అమ్మ = మాయమ్మ యైనది. ఇట్లే కలకు + అమ్మ; ఉండఁగా టుగాగమము వచ్చి కలకు + ట్ అమ్మ = కలకుటమ్మ—అనిదైనది. ఇట్లే తక్కినవి.

## తపరకరణము :

"తపర స్తత్కాలస్య" 1–1–70

అనిపాణిని సూత్రము. తఃపరోయస్మాత్స తాత్పరశ్చో చ్చార్యమాణ సమ కాలస్యైవ సంజ్ఞాస్యాత్" అని వృత్తి కారునియుక్తి. అనఁగా దేని కంటె—తకారము పరముగా నున్నదో ఏది తకారము కంటె పరముగా నున్నదో ఈ రెండు విధములైనవియును, స్వోచ్చారణ కాలములో నుచ్చరింపఁబడు దానికే సంజ్ఞయగును-అని పై వృత్తి కర్థము.

ఒక అచ్చు పిమ్మట పొల్లు తకారము చేర్చి పల్కిన అది తత్కాల వర్ణమునకే సంజ్ఞయగును. 'అ' దీని తరువాత 'త్' పొల్లు చేరిన అత్ అగును. అందుచే హ్రస్వఅకారమే గృహీతమగును. దీర్ఘఅకారము గృహీతము కాదు. ఈ తపరకరణ నిర్వచనమును సూరి ప్రత్యేకించి నిర్వచింప లేదు. అయినను సంస్కృత వ్యాకరణజ్ఞులైన బాలురకు అత్తునకు, ఇత్తునకు అని సూత్రముల మూలముననే "ఇత్తు నకు బహువచనంబు పరంబగునపుడుత్వం బగు" అను సూత్ర వివరణమున "తపరకరణంబుచే దీర్ఘంబునకుత్వంబు లేదు" అని తపరకరణమును జ్ఞాపకము చేసినాఁడు. తపరముగాఁ జేయుటయే తపరకరణము.

ఉదా:— అత్తునకు సంధి బహుళముగానగు.

ఏశులు (ఏరు + లు) పాశులు (పాలు + లు) త్రాశులు (త్రాడు + లు)

ఇత్యాదులలో బహుత్వమందు రలడల కాదేశమయిన శకార మలఘువు.

వంకాయ – వంక ఇత్యాదులందున్న సహజ వకారము అలఘువు.

## అంతస్థములు :

"యరలవాః అంతస్థాః" అని శిక్షావచనము.

యరలవలకు అంతస్థములని పేరు. కాదులగు స్పర్శలకు, ఊష్మములగు శషసలకు మధ్య నుండు వర్ణము లగుటచే అంతస్థములని సార్థక నామమును బడసిన వని కొందఱ అభిప్రాయము. "స్పర్శోష్మాణాం అన్తః మధ్యే తిష్ఠన్తీతి అన్తః స్థాః" అని ఉవ్వట భాష్యము. "స్వస్యస్వస్యస్థానస్య అన్తే తిష్ఠన్తీతి అంతస్థాః" ఏవం యకారాదీనాం చతుర్ణాం కరణాంత వ్యాపార నిష్పాదత్వాద న్తస్థా ఇత్యాఖ్యా–

ఉదా:— య–ర–ల–వ

ఈ నాల్గింటికి అంతస్థములని పేరు.

## తత్సమము :

"సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు" అని చిన్నయ సూత్రము. సంస్కృత ప్రాకృత ప్రకృతమా

ద్వితీయైక వచనాంతముల ప్రాతిపదికములుగాఁగొని తెనుఁగు వ్యాకరణ ప్రకారము గావించిన పదములు తత్సమములు. అనఁగా సంస్కృత పదముల తుది నున్న దీర్ఘమును హ్రస్వము గను, ప్రథమా విభక్తి లోపమును, కొన్నిచోట్ల ద్విత్వోత్వములను, కొన్ని చోట్ల అట్లే గ్రహించుటవలనను తత్సమ పదముల గుర్తింప వచ్చును. అట్లే ప్రాకృత తత్సమములను కూడ గ్రహింప వచ్చును. "సంస్కృత ప్రాకృతములు ప్రకృతులు—ప్రకృతి ద్వయ తుల్యంబు తత్సమంబు" అని శబ్ద లక్షణసంగ్రహమున కూడ వాక్రుచ్చెను. కేతనాదులు సంస్కృతమునేకైక ప్రకృతిగా భావించి ప్రాకృతాదులను విస్మరించిరి.

ఉదా:— విద్యా = ఇది సంస్కృత పదము. "నామంబుల తుది దీర్ఘమునకు హ్రస్వంబగు" అని తెలుఁగు వ్యాకరణ ప్రకారము హ్రస్వము చేయగా వచ్చిన 'విద్య' అనునది తత్సమము. హరి = 'ఇల్గారా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు' అను దానిచే ప్రథమా విభక్తి లోపము కల్గిన తత్సమ పదము. రుక్కు = రుక్ అను హలంతమునకు "ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లునకగు" అనుదానిచే ఉగాగమద్విత్వములు గల్గిన రూపము. దివి = ఇది సంస్కృతమున సప్తమీ విభక్త్యేక వచనపదము. ఇది తెలుఁగున అట్లే గ్రహింపఁబడినది. 'భూదివోస్తుపా యత్తత్' అని నన్నపార్యుడు రూపముల సాధువా

నర్చెను. సూరి ఇట్టి రూపముల నిపతించిచూపెను. (తుల్యాతు సమా—అని చింతామణీయము- "సంస్కృత ప్రాకృతే ప్రకృతి" అని చిన్నయ సూత్రాంధ్రవ్యాకరణము) అగ్నిః-అగ్గీ-అగ్గి; అగ్గి యనునది ప్రాకృత రూపముతో సమానముగ నుండుటచే ప్రాకృత సమము.

## తద్భవము :

"సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" అని సూరి లక్ష్మము. సంస్కృత ప్రాకృతముల నుండిపుట్టినవి తద్భవములు. వీనికి వికృతి పదములనియు పేరు. "ఏషా వికృతిః" అని సూరి సూత్రాంధ్ర వ్యాకరణమునను, "వికృతంబు తద్భవంబు" అని శబ్దానుశాసనమునను గలదు. "వ్యుత్పత్తంబు తద్భవంబు" అని శబ్ద లక్షణ సంగ్రహము నను గలదు. దీనికి పై సూత్రములో చెప్పిన ప్రకృతిద్వయము అనునది ఈ సూత్రములోని తత్ అను దానికి అర్థము. అనఁగా ప్రకృతి ద్వయ జాతంబు తద్భవంబని యర్థము. "ప్రకృతి ద్వయజాతజ్జా" అని నన్నయ భట్టీయము. సంస్కృత ప్రాకృత పదములు వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశ వర్ణ వ్యత్యయములచే పరిణతి నొంది తద్భవములని వ్యవహరింపఁబడుచున్నవి.

i) వర్ణలోపము:— తామరసమ్—తామర. 'సమ్' అనునది లోపించి 'తామర' అని తద్భవరూపము నొందినది.

ii) వర్ణాగమము:- రథః—అరదము. అవర్ణము
కముగా వచ్చి తద్భవమైనది.

iii) వర్ణాదేశము:- ఆకాశః — ఆకసము. ఇట
'కా' కు 'క' వర్ణమును 'శ' కు 'స'వర్ణమును ఆదేశముగా
వచ్చి తద్భవమైనది.

iv) వర్ణవ్యత్యయము:- శుచిః —చిచ్చు. శుచిలోని
రెండవ అక్షరము మొదటి వర్ణముగ వ్యత్యయము చెంది
"చిచ్చు" ఐనది.

## దేశ్యము :

"త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యము"

అని సూరి సూత్రము. అనఁగా శ్రీ శైల దాక్షా
రామ కాళేశ్వరములు గల దేశములో జనవ్యవహారము
వలన సిద్ధమైన భాష దేశ్యమని యర్థము. "దేశేభవమ్
దేశ్యమ్"అనఁగా ఆయాదేశంబులందు జనించిన భాష దేశ్య
మని యర్థము. 'ప్రవాహినీ దేశ్యా' అని చింతామణి.
దేశ్యం అర్షంచ రూఢత్వాత్ స్వతంత్రత్వాచ్చ భూయసా
లక్ష్మనాపేక్షతే తస్య సంప్రదాయోహిబోధకః- దేశ్యము,
ఆర్షమునగు వ్యవహారము రూఢమై యుండుట వలనను
స్వతంత్రముగాఁబ్రయోగింపఁబడి యుండుట వలనను లక్షణ
రచనను అపేక్షింపదు. ఏలయన వానికి సంప్రదాయమే

"ఆమ్రేడితమ్ ద్విస్త్రిరుక్తమ్" అని అమరకోశము. అనఁగా రెండు సార్లుగాని మూఁడుసార్లు గాని పలుకఁబడునది ఆమ్రేడితమని యర్థము.

ఉదా:— ఓహెూ + ఓహెూ = ఓహెూహెూ.

ఇట ఓహెూ అను పదము రెండు పర్యాయములు పలుకఁబడినది. అందు రెండవసారి పలుకఁబడిన 'ఓహెూ' అనునది ఆమ్రేడితము. కనుకనే 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగనగు' అను సూత్రముచే సంధియైనది. అసకృదుచ్చార్యత ఇతి ఆమ్రేడితమ్. అనఁగా పెక్కుసారులుచ్చరింపఁబడినదని యర్థము.

## సంశ్లేషము:

"సంశ్లేషంబనఁగా మీఁది హల్లుతోఁగూడు కొనుట"

అని సూరి వివరణము. అనఁగా ఒక హల్లు మీఁది హల్లుతో [వేఱొక హల్లుతో] కూడి యుండుట లేక తాఁకి యుండుట సంశ్లేష మనఁబడును. దీనినే సంస్కృతమున సంయోగమని యందురు. హలోఽనన్తరాస్సంయోగః 1—1—7 అజ్భిరవ్యవహితా హలస్సంయోగ సంజ్ఞాస్యుః—అని పాణినీయులు. అనఁగా అచ్చులతో వ్యవధానములేని హల్లులు సంయోగ సంజ్ఞకములగునని యర్థము. మొత్తము మీఁద భిన్నహల్లుల కలయిక సంశ్లేషమని చెప్పనగును. "భిన్న హల్సంయోగం సంశ్లేషమ్" అని నానుడి.

ఉదా:— పూచెను + కలువలు = పూచెన్గలువలు.

ఈ పై లక్ష్యములో అయా కార్య విశేషముల నందిన తరువాత 'న్' అను హల్లు దాని మీఁది దగు 'గ' అను హల్లుతోఁ గూడి సంశ్లేషమనఁదగినది. ఈ సంశ్లేషము సూరిచే 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు' అను సూత్రముచే విహితము.

# ద్విత్వము :

"ద్వయోర్భావః ద్విత్వమ్" రెంటి యొక్క సంభావము. అనఁగా ఉన్న దానినే మఱి యొకసారి యుచ్చరించుట.

అచ్చులతో వ్యవధానము లేని ఏకరూపము గల హల్లుల కూడిక ద్విత్వమనఁబడును.

ఉదా:— అ + కన్య = అక్కన్య.

ఇచట—'త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అను సూత్రముచే ద్విత్వము విధింపఁబడినది. 'క' అనున సంయుక్త హల్లు 'క్' అను హల్లుతోఁ గూడినది కనుక ద్విత్వము, 'అక్కన్య' ఇది వర్ణద్విత్వము. ఆదరాద్యర్థమున ఒక పదమునకుఁగాని లేదా వాక్యమునకుఁగాని ద్విత్వము రావచ్చును. రమ్ము + రమ్ము = రారమ్ము— ఈ రీతిగా ద్విత్వమువాగా విశేషముల వైయాకరణులు చూపిరి. ఈ ద్విత్వమునే ద్విర్వచనమని పాణినీయులు వ్యవహరింతురు.

## స్వత్వము :

"స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతి భావము"

స్వ=తన యొక్క [అనఁగా ద్రుతము యొక్క] త్వం = భావము కనుక స్వత్వమనునది సార్థకసంజ్ఞ. అయినచో సూరి ద్రుత ప్రసక్తిలో నీ సంజ్ఞను విధించుటచే "ద్రుతము నకుఁ బ్రకృతి భావము"ని ద్రుత విషయముగ నుడివినాఁడు. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేష ములు రాని పక్షమున ఈస్వత్వము విధింపఁబడినది. అనఁగా బిందు సంశ్లేషములు రాకమునుపున్న స్వర విశిష్టనకారము స్వత్వ మనఁదగును. కాని ద్రుతమునకు సమాసములో స్వత్వము లేదు. (సంధి—26)

ఉదా:— పూచెను + కలువలు=పూచెంగలువలు; పూచెఁగలువలు; పూచెన్గలువలు. ఈ బిందు సంశ్లేషములు విభాషగ విధించుటచే ఇవి రాక పోయిన 'పూచెను గలువలు' అను సహజ రూప ముండును. ఇందులోని 'ను' అనునది స్వత్వ రూపము.

## అవసానము :

"విరామోఽవసానమ్" 1—4—110

వర్ణానామభావోఽవ సాన సంజ్ఞః స్యాత్ "— అని

పాణినీయులు. వర్ణముల యొక్క అభావ మవసానసంజ్ఞక మని యర్థము. పదము యొక్కగాని, వాక్యము యొక్క గాని సమాప్తియే అవసానమని చెప్పవచ్చును.

ఉదా:— 'అతిశయముగ బుద్ధి మంతుడగు బుధసేవన్' ఈ పద్య పాదమున 'సేవన్' అని పల్కిన పిమ్మట మఱియొక ఉచ్చార్యమాణమగు శబ్దము లేకుండుటచే 'న్' అనునది అవసాన సంజ్ఞకమగును. కనుక ''అవసానంబు నందు ద్రుతస్వరంబునకేని, ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు''అను దానిచే ద్రుత స్వరము లోపించినది.

## ప్రత్యయము:

''ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు''— తెలుఁగున నీప్రత్యయమును 'వర్ణక'మని యందురని స్పష్ట పఱిచెను. ''ప్రత్యయో వర్ణకః''అని సూత్రాంధ్ర వ్యాకరణమునను ''ప్రత్యయంబు వర్ణకంబు'' అని శబ్దానుశాసనమునను, శ. ల. సంగ్రహమునను సూత్రించెను. ''ప్రత్యయ ఇహ వర్ణకః అని చింతామణి [తత్సమ—10]

''ప్రత్యాయ్యతే అర్థః అనేన ఇతి ప్రత్యయః''— అర్థం సంప్రత్యాయతి సప్రత్యయః— అర్థమును ప్రతీత మొనర్చునది ప్రత్యయమని యర్థము. ప్రత్యేతి పశ్చాదాగచ్ఛతి ఇతి ప్రత్యయః''—అనఁగా వెనుక ప్రాప్తమగునది ప్రత్యయము. ప్రతీయతే విధీయత ఇతి ప్రత్యయః విధింపఁ

బడునది ప్రత్యయము. ఈ ప్రత్యయములు నాలుగు విధ ములు. అవి సుప్పులు—తిజ్ఞులు—కృత్తులు—తద్ధితములు.

ఉదా:— సుప్ ప్రత్యయములు
డు, ము, వు, లు, ప్రథమ; నువర్ణంబు ద్వితీయ;
చేత—చే—తోడ, తో, తృతీయ; కొఱకు, కై: చతుర్థి
వలన కంటె, పట్టి, పంచమి: కు, యొక్క, లోపల షష్ఠి:
అందు, న, సప్తమి:

2. తిప్ ప్రత్యయములు
డుజ్—రు=ప్రథమము, వు. రు = మధ్యమము,
ను.ము. = ఉత్తమము.

3. కృత్ ప్రత్యయములు-
ట, మిటి, ఇ, క, కు, తప్, ప, పు, ఇఁక, ఇమి, ఒడి, నది,
గ, డ, ఇకి, అక, అ, డు, ఉ, వడి, ఇత్యాదులు.

4. తద్దిత ప్రత్యయములు.
అ—అము, అరి, ఆనము, ఇమి, న, ఇక, ఉక, కా—కత్తియ-
ఈ, త, అడి, ఇడి, ఎఁడు—బంటి, కొలఁది ఇత్యాదులు.

## వచనము :

"ఉచ్యతే సంఖ్యా అనేన ఇతి వచనమ్"

డు ము వు ని ను న లేక వచనంబులని శబ్ద లక్షణ సంగ్రహమున 'ని-ను' లను అధికముగా చెప్పియున్నాఁడు.

ఏకత్వ బహుత్వ సంఖ్యలను చెప్పునది వచనమని యర్థము. ఏకవచనము-బహువచనమని ద్వివిధము.

ఏక వచనము:- ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయం బేక వచనంబు అని సూరి సిద్ధాంతము. అనఁగా ఒకటి అను సంఖ్యను దెలియఁజేయునది ఏక వచనము.

ఉదా:- రాముఁడు-భీముఁడు-సోముఁడు ఇత్యాదులు (డు ము వు లేక వచనంబులని సూరి సూత్రము) లోహ వాచక శబ్దము లైన ఇనుము-ఇత్తడి మొ॥ వి, ఇరులు-కేలు ఇత్యాదిగా కొన్ని నిత్యైక వచనాంత శబ్దములు కలవు.

బహువచనము:— బహుత్వ సంఖ్య బోధించు ప్రత్యయంబు బహువచనంబు. అని సూరి నిర్వచనము. అనఁగా అనేకములైన వస్తువులను బోధించు ప్రత్యయము బహువచనమని యర్థము. "లువర్ణంబు బహువచనంబు" అని సూత్రము. "లు' అనునది బహువచన ప్రత్యయము. లువర్ణముతో పాటు 'ల' వర్ణము కూడ బహువచన ప్రత్యయము. "లు ల' లు బహువచనంబులు అని శబ్ద లక్షణ సంగ్రహమున వచించెను.

ఉదా:- రాములు-సోములు-వనములు-ధేనువులు ఇత్యాదులు, ధాన్య వాచక, క్రీడావాచక విశేషములను దెలుపు శబ్దములు నిత్య బహువచనాంత శబ్దములు. సస్యవాచికి ధాన్యంబు నని నిత్యంబు శబ్దాను శాసనము చూడవలెను.—

అని శబ్దాను శాసనముఁగలదు, సంస్కృతమున 'ద్వివచన మనిమూఁడవది కూడఁగలదు.

## ఆమంత్రణము :

దీనికి పాణినీయులు. 'ఆమంత్రితమ'ని సంజ్ఞనుడివిరి. 'సామంత్రితమ్' 2—3—48. సంబోధనేయా ప్రథమా తద న్తమా మంత్రిత సంజ్ఞస్యాత్. దీని ప్రకారము ఆమంత్రిత మనఁగా పిలుచుట అను అర్థము భాసించదు. కాని సంబోధ నమున పాణిని ప్రథమను విధించి యున్నాఁడు. 'సంబోధ నేచ 2-3-47' దీని చొ॥న సంబోధన విభక్త్యంతముప్రయుక్త మగుటచే ఆహ్వాన మర్థము లభించగలదు. కనుక పాణినీయ మిందు కనుకూలమే.

"ఒకరిని పిలుచుట ఆమంత్రణము" దీనినే సంబోధన మందురు. ఎదుటి వారి ఇష్ట ప్రకారము అనుజ్ఞ చేయుట ఆమంత్రణము. "ఆమంత్రణం కామచారనుజ్ఞా" అని పాణి నీయులు. 'ఓ' అనునది సంబోధనమును దెలుపు శబ్దము. "ఓయా మంత్రణంబునందగు"— 'ఓ' యను శబ్దము సంబో ధనము నందగునని యర్థము" అని సూరి.

ఉదా:— ఓ రామా! ఓ సీత!

ఇచ్చట రాముని పిలుచుట అనునది ఆమంత్రణము. కనుక 'తద్బోధకమగు 'ఓ' అనునది చేర్పఁబడినది.

## మహద్వాచకము :

"స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు"

నని సూరి సూత్రము. స్త్రీ వాచక శబ్దముల కంటెను, తిర్యక్కులకంటెను; జడముల కంటెను భిన్నములై నవి మహత్తులు. వాని విశేషణములను దెలుపు శబ్దములు కూడ మహత్తులనఁబడును. అనఁగా మనుష్య-దేవ-యక్ష-గంధర్వాదుల లోని పురుషులను దెలుపు శబ్దములు మహద్వాచకములని చెప్పనగును. తన సూత్రాంధ్ర వ్యాకరణమున ఇంకను విపులీకరించెను. "మహన్తో స్త్రీ తిర్యగ్జడాః— తద్విశేషణాని అమద్వత్సి శాచాద్యాగ్రహ భూతగణాస్వదా! క్లీబో మిత్రాదయః పుంవద్విభాషా మహదర్థకాః"—అని విశద పఱిచెను. దీన క్లీబంబులైన మిత్రాది శబ్దములు కూడ మహదర్థబోధకములని యర్థము. "స్త్రీపశు జడ భిన్నంబులు మహత్తులు. వాని విశేషణంబులు"—అని శబ్దలక్షణ సంగ్రహమున కూడ చెప్పెను.

ఉదా:— ఇంద్రుఁడు, రాముఁడు—యక్షుఁడు—గంధర్వుఁడు మొ॥నవి.

## మహతీ వాచకము :

స్త్రీలను దెలుపు శబ్దములు మహతీ వాచకములు. అనఁగా దేవ—మనుష్య—యక్ష గంధర్వాది జాతులలో

నుద్భవించిన స్త్రీలను దెలియఁజేయునవి మహతీ వాచకము లని యర్థము. వాని విశేషణములను దెలియఁజేయు పదములు కూడ మహతీ వాచకములే.

ఉదా:– శచి, సీత, ఒక్కసి, రంభ–ఇత్యాదులు

## ఆమహద్వాచకము :

తిర్యగ్జడములను దెలుపు పదములు, వాని విశేషణములును అమహద్వాచకములు. తిర్యక్కులనఁగా పశుపక్ష్యాదులు. జడములనఁగా అచేతనములు. అనఁగా చైతన్యము లేక నిశ్చలనముగా నుండునవి.

ఉదా:– ఎద్దు, ఆవు, పుంజు, పెట్ట, చెట్టు, పుట్ట ఇత్యాదులు.

ఈ వాచక వివక్ష తెనుఁగునందేకాని సంస్కృతమునందు లేదు.

## ఇత్తు :

"కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై
ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తు

నాఁబడు" నని సూరి వివరణము. యః కార్యార్థం సూత్రే అను బధ్యతే నతు ప్రయోగే దృశ్యతే స ఇత్ అని త్రివిక్రమ శబ్దాను శాసనము మూలము. అనఁగా కార్య ప్రయోజనము కొఱకు వర్ణకములందుఁ జేర్పఁబడినదై తత్ప్రయోగకాల మునలోపమునొందు వర్ణము 'ఇత్తు' అనఁబడునని

యర్థము. "ఇత్ - కృతే కస్మై చిత్కార్యాయోచ్చార్య మాణో వర్ణ ఇత్సంజ్ఞః స్యాత్" అని పాణినీయులు. లోకమున ప్రయోగించెడి పదములకు ఏదో యొకరీతిని సాధుత్వమును జూపుట వైయాకరణుల పని. ప్రయోగములలో 'చేయునతఁడు' మన్నగు రీతిని 'న' కారము కాని ఎంచుచున్నది. సంధి లేనిచో ఆనకారము కానరాదు. సంధి యందు కూడ రెండు పదముల మధ్య కాన వచ్చుచున్నది. అట్టి రీతిని నకారమును ప్రవేశ పెట్టుటకై 'నుక్' అని ఒక కకారము 'ఇత్' సంజ్ఞకముగా చేర్చబడినది. ఈ రీతిగా కిత్, అగుటచే ఆ ఆగమమంతా నయముగా చేరినది. కకారము ఇచట కానరాదు. కాఁగా వ్యాకర్త దృష్టిలో 'న' కారము ప్రధానము గాను, ఏదో యొక కార్యమును పొందించుటకై గ్రహింప బడినాదున అప్రధానముగా నున్నదని భావింప వలయును. ఇది యంతయు శాబ్దికుల కల్పనయే కదా! ఈ దృష్టితోనే ఇత్సంజ్ఞక వర్ణములను 'అనుబంధ' అను పదముతో మహాభాష్యకారాదులు వ్యవహరించి యున్నారు. అనుబంధమనగాఅప్రధానముగా నుచ్ఛరింపఁబడునదని యర్థము. కాగా ప్రయోగములో వినబడకుండ నేదోయొక కార్య విశేషమును సంపాదించెడిది, ఇత్సంజ్ఞకమగును. ఏ వర్ణము ఇత్సంజ్ఞక మగునో ఆవర్ణము లోపించునని పాణిని 'తస్యలోపః' అని సూత్రించెను. ఒక్క పాణినియే కాక వైయాకరణులందరు నీ మార్గము నను

సరించి యున్నారు. అట్లుగాకున్న శబ్ద నిర్వచన సూచకము కానేరదు.

ఉదా:— కిత్ =నుగాగమము, టిత్, = యడాగమము—ఇత్యాదులు. 'నుక్' అనునది కిత్తు గనుక 'ఆద్యంతౌటకితౌ' అను శాస్త్రము చొప్పున ఆద్యంతావయవములుగా చేరుటయే ఇత్ ప్రయోజనము. ఆపిమ్మట లోపించును.

చేయు + అతడు = చేయున్ + అతఁడు = చేయునతఁడు

## నామము:

"నామంబనఁగా ప్రాతి పదికము"

అని సూరి నిర్వచనము. 'ప్రాతిపదికం హి నామ' అని నన్నయ భట్టీయము. 'ప్రతి పదమ్ గృహ్ణాతీతి ప్రాతి పదికమ్' అని వ్యుత్పత్తి. "అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్"- 1-2-45 ధాతుంప్రత్యయం, ప్రత్యయాంతంచవర్జయిత్వాఅర్థవత్ శబ్దస్వరూపం ప్రాతిపదికసంజ్ఞంస్యాత్ అని పాణినీయులు వచించిరి. అనఁగా ధాతువు ప్రత్యయము, ప్రత్యయాంతము కాని అర్థవంతమైన శబ్దము ప్రాతి పదిక మనఁబడునని యర్థము. "కృత్తద్ధిత సమాసాశ్చ" 1-2-46 కృత్తద్ధితాన్తే సమాసాశ్చ ప్రాతిపదిక సంజ్ఞాస్స్యుః"— కృదంత తద్ధితాంత—సమాసములు ప్రాతి పదిక సంజ్ఞ కలవి యగును.

"హలన్తం స్వన్తం ప్రాతిపదికమ్" అని సూత్రాంధ్ర వ్యాకరణమున సూరి సూత్రము. హలన్తమైనది 'సు' అంత ముగా కలది ప్రాతి పదికమని యర్థము.

సంజ్ఞ, డిత్థ,

ఉదా:— కృదంతము = రామ
తద్ధితాంతము = భార్గవ
సమాసము = రాజపురుష

## ఉత్తమము-ఉపోత్తమము :

"త్ర్యాదీనామంత్య ముత్తమమ్
తత్స మీప ముపోత్తమమ్"

అని పాణినీయము. మూఁడక్షరములు గల శబ్దము లలోఁ జివరి వర్ణ ముత్తమము. ఈ ఉత్తమము కంటెఁ బూర్వము గల వర్ణము—ఉపోత్తమము.

ఉత్తమము : ఆచ్ఛిక పదంబులందుత్తమంబులగురు లుడుల ముందటి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు" అను సూత్రము వలన నల్లేరు—పల్లేరు మొదలుగాగల శబ్ద ములలో హ్రస్వము వచ్చి నల్లెరు—పల్లెరుఐనవి.

ఉపోత్తమము : వికృతి యం దికారాంతముల యుపోత్తమేత్వంబునకుబహువచనంబుపరంబగునపుడుత్వంబగు కలికి + లు కలుకులు. ఉపోత్తమమునకు ఉత్వము వచ్చినది.

ఉదా:- కలికి-ఇది మూఁడక్షరముల శబ్దము. దీనిలోని 'కి' ఉత్తమము. దీనికి సమీపముననున్న 'లి' ఉపోత్తమము.

## ఆచ్ఛికము :

"సంస్కృత సమేతరంబైన యీ భాష యచ్ఛయనంబడు"

నని సూరి సూత్రము. అచ్ఛా సంస్కృత సమేతరా అని సూత్రాంధ్ర వ్యాకరణము. సంస్కృత సమముల కంటెనన్యమైనది. అనఁగా సంస్కృత భవ-ప్రాకృత భవ-దేశ్యములుగా నున్న భాష యచ్ఛయనంబడును. దీనినే అచ్ఛ తెలుఁగందురు. అచ్ఛయన స్వచ్ఛమైనదని యర్థము. అనఁగా అన్యవస్తుమిశ్రణము లేనిదని యర్థము. ఈ అచ్ఛ తెలుఁగునే ఆచ్ఛికమని కూడ నందురు. "అచ్ఛాయాంభవం ఆచ్ఛికమ్" అని వ్యుత్పత్తి. ఈ ఆచ్ఛిక శబ్దములు తఱుచుగ స్త్రీ) సమంబులు, క్లీబ సమంబులుగ నుండునని సూరి వచించెను.

ఉదా:- అన్న-మిన్న-అల్లము-నెయ్యము-తఱుచుగననుటచే పుంలింగ తుల్యంబులును గలవు-మగఁడు, తమ్ముఁడు.

## ఔపవిభక్తికము :

"విభక్తి నిమిత్తకంబులయి యాదేశాగమా
త్మకంబులయిన ఇ, టి, తి, అను వర్ణంబు లౌపవిభక్తి

కంబులు" అని సూరి వాక్కు. అనఁగా ద్వితీయాది విభక్తులు కారణములు గావచ్చు. ఇ-టి-తి వర్ణము లౌప విభక్తికములని యర్థము. ఇవి ఆదేశములుగను-ఆగమములుగను-ఆదేశాగమములుగను వచ్చును. ద్వితీయాది విభక్తులకుఁబూర్వము వచ్చునవి గాన ఉప విభక్తులనియు, దీనికి సంబంధించిన ఇ-టి-తి వర్ణములౌప విభక్తికములనియుఁ జెప్పనగును.-"టింట్యాదులౌప విభక్తికంబుల"నిశబ్ద లక్షణ సంగ్రహమున సూరి వ్రాసెను.

ఉదా:- ఇ=కాలిని-

ఆదేశము-టి- త్రాటిని—

ఆగమము—అన్నిటిని.

ఉభయాత్మకము ... పగలు-పగటిని-పగలిటిని

## సర్వనామము :

"అన్నిప్రభృతులు సర్వనామములు"

అని వివరణము.'అన్నిప్రభృతి సంఖ్యాస్సర్వనామాని' అని సూత్రాంధ్ర వ్యాకరణము. అన్ని ప్రభృతి సంఖ్యా వాచకంబులు సర్వనామంబులని శబ్దానుశాసనము. అన్ని, యిన్ని, యెన్ని, కొన్ని, పలు, పెక్కు, ఈ.ఏ, నీ, నా, మన, తా సంఖ్యా వాచకంబులు సర్వనామంబు లని శబ్ద లక్షణ సంగ్రహమున వివరించెను. ఇవియే బాల వ్యాకరణమునఁ

గూడ వివరింపఁబడియె. "సర్వస్యాఽపి నామ సర్వనామ" అని వ్యుత్పత్తి. అనఁగా అంతటికిని నామమైనది సర్వనామ మని యర్థము. నామ వాచకమునకు బదులుగా వాడఁబడు నది సర్వనామమని వ్యావహారికార్థము. వాక్యము నందలి నామ వాచకమును పునరావృత్తి చేయకుండఁదదర్థమును బోధించుటకుపయోగపడు శబ్దములే సర్వనామములని యర్థము. ఈ సర్వనామముచే వస్తు వివక్ష జరుగును. "వస్త్వాప లక్షణం యత్రసర్వనామ ప్రయుజ్యతే ద్రవ్య మిత్యుచ్యతే సోఽర్థా భేద్యత్వేనవివక్షితః" — సర్వాది శబ్దములుసర్వనామములు "సర్వాదీనిసర్వనామాని" 1-1-27 అని పాణినీయము.

సర్వ-విశ్వ-కతర-కతమ-యతర-యతమ-తతర-తతమ ఏకతర-ఏకతమ-అన్య-అన్యతర-ఇతర-త్వ-సమ-సిమ—నేమ— పూర్వ-పర-అపర-దక్షిణ-ఉత్తర-అధర-స్వ -అ న్తర-ఏక- ఉభ—ఉభయ—ద్వి-—తత్ —భవత్ -—తద్ —త్యద్ —యద్ — ఏతద్ —యుష్మద్ -అస్మద్ -కిమ్-ఇదమ్-అదస్.

ఉదా:— వాఁడు-వీఁడు-అతఁడు-ఇతఁడు-అన్ని-ఇన్ని-ఎన్ని

## డుమంతము :

"డుఃవర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతం బనం బడు" నని సూరి స్పష్టీకరించెను. ఇది సూరి కల్పిత సంజ్ఞ. డుః అస్య అస్తీతి డుమత్ = డు కలది డుమంతమని

సార్థక సంజ్ఞ. ప్రథమా విభక్తి ప్రత్యయ మగు డు వచ్చుటకు యోగ్యమైనది డుమంతమని యర్థము. "పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్జగు" అను దానిచే డుజ్విహితము. ఈడుజ్ - చేరుటకు బూర్వమున్న శబ్దమే డుమంతమని యర్థము. ఏయదిడుజ్ నకుంబ్రకృతి తన్మాత్రంబు డుమంతంబని శబ్ద లక్షణ సంగ్రహమున నుడివెను.

ఉదా:- రాము-రాముఁడు-తెనుఁగు డుమంతము-మగ-మగఁడు.

## పర్యుదాసము :

"ప్రాధాన్యం హి విధేర్యత్ర ప్రతిషేధోఽప్రధానతా
పర్యుదాసస్సవి జ్ఞేయో యత్రోత్తర పదేననఞ్"

అని శబ్ద స్తోమము. విధికి ప్రాధాన్యము కల్గి నిషేధమునకు అప్రధానము కల్గిన పర్యుదాస సంజ్ఞ అందురు. అదినఞ్ పదముతోఁ గూడి ఉత్తర పదముతో అన్వయము కల్గియుండును. (పరి + ఉత్ + అస + ఘఞ్ = నివారణే) నివారించుటయను నర్థమున ఈపర్యుదాస సంజ్ఞ ఉండును. నఞ్ నకు అభావమని యర్థము. అది క్రియ యొక్క లేమిని చెప్పిన ప్రసజ్య ప్రతిషేధమందురు. ఇచట కడవలేదు. అత్రఘటోనాస్తి. అత్రబ్రాహ్మణోనాస్తి. ఇచట బ్రాహ్మణుఁడు లేఁడు. అట్లు కాక 'నఞ్' అర్థమును నామార్థముతోనే అన్వయించిన అదిపర్యుదాస మనఁబడును. ఎట్లనగా

అబ్రాహ్మణః అస్తి. ఇచట రెండభిప్రాయములు వ్యక్తము లగును. అబ్రాహ్మణుడున్నాడు. అనగా బ్రాహ్మణుడు కాని వాడు; బ్రాహ్మణునితో సమానుడు అను అర్థము లభించును. ప్రసజ్యప్రతిషేధమున బ్రాహ్మణుని యొక్క లేమియే భాసించును. పర్యుదాసమున బ్రాహ్మణుని యొక్క లేమియే కాక అతనితో సమానమైన మనుష్యుడున్నట్లు భాసించును. దీనిలో బ్రాహ్మణభేదము, బ్రాహ్మణ సాదృశ్యము రెండును ఘటకములై యున్నవి. ఈ ప్రసజ్య, పర్యుదాసముల నాశ్రయించుట వలన శాస్త్రములలో అర్థములు చాల విపరీతముగ భాసించును. వీనిని బట్టి శాస్త్రార్థములు పెంపొందును.

ప్రకృతమున ఉదంతమునకు నిగాగమము రాదని నిషేధింపలేదు. మఱి యేమన పర్యుదాస మాశ్రయింపబడినది. ఉదంతము కానట్టియు ఉదంతమగు దానితో సమానమగు నట్టి దానికి నిగాగమము వచ్చును. దీని వలన ఉదంతము కానిది కూడ ఆచ్ఛిక నామ వాచకము కావలెనని అర్థము లభించుచున్నది.

ఉదా:— 'అనుదంతమగు తెనుగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగు'

అను సూత్రములో 'అనుదంతము' అనునది పర్యుదాసము. 'ఉదంతము కాని దానికి' అను విధికి ప్రాధాన్యము కల్గినది.

కనుక అది నఞ్ పదముతోఁగూడి పర్యుదాస సంజ్ఞక మైనది.

## అనుకరణము :

"ప్రకృతి వలె ననుకరించుటయనుకరణము"

ఒకరు ఏదైనఁజెప్పినపుడు దానిని జెప్పినది చెప్పినట్లుగా ననుకరించి పలుకుట యనుకరణ మందురు. అను కరణమును దెలుపుటకు శబ్దముచివర'అను' అనునది చేరును. సంస్కృత పదమును దెలుఁగులోని కనుకరించునపుడు సామాన్యముగా 'అను' అనునది చేర్చి పలుకుదురు. దీనినే యనుకరణ మందురు. సంస్కృతవాక్యముననున్నది యున్నట్లుగా ననుకరించి పలుకుట అనుకరణము.

ఉదా:— వర్ధతాం శ్రీః అనియె
వర్ధతాం శ్రీః అనునది సంస్కృత పదము.
దానిని దెలుఁగులోని కనుకరించునపుడు 'అను' అనునది చేరినది.

## విభాష :

"నవేతివిభాషా"

నిషేధవికల్ప యోర్విభాషా సంజ్ఞాస్యాత్—అని పాణినీయులు. నిషేధము—వికల్పము ఈ రెంటికి విభాష సంజ్ఞ

యని అర్థము. ఇట్లు పాణిని విభాషాసంజ్ఞను చేసిన తాను ఈ సంజ్ఞానియమము నతిక్రమించియే తన శాస్త్రము వ్యవహరించెను. కనుక 'నవేతి విభాషా' యను సంజ్ఞాకరణమును వైయాకరణులు పాటింప నక్కఱలేదు. విభాషా, వా, అన్యతరస్యామ్. మున్నగుపదములన్నియు సమానార్థకములే. అంతియె కాని 'నవేతి విభాషా' అను సూత్రము ననుసంచి విధింపఁబడిన విభాషా సంజ్ఞ సార్వత్రికముకానేరదు. మఱియు ఆ సంజ్ఞాకరణము కూడ బహుక్లిష్టమైన యర్థము తోఁగూడియున్నది. మహాభాష్యకారుఁడు పై చూపఁబడిన అర్థమునే అంగీకరించి యున్నాఁడు. ఇంత అభిప్రాయమును గుర్తించియే సూరి ప్రభృతులు పాణినిచే రచింపబడిన విభాషా సంజ్ఞను పాటింపక వికల్పపరముగనే విభాషా శబ్దమును వాడసాగిరి.

ఉదా:— "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు"—

పూచెను + గలువలు=పూచెంగలువలు – పూచెఁగలువలు

పూచెన్గలువలు—పూచెనుగలువలు.

ఇచట విభాష వలన బిందు సంశ్లేషములు వికల్పముగ వచ్చినవి.

నిషేధము:-"లుప్తశేషంబునకు పరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు" అను సూత్ర వివరణమున

'వ్యవస్థి విభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు'—
అని స్పష్టముగ నిగదించినాఁడు.

ప్రా + కెంపు—అనునపుడు పై సూత్రముచే నుగాగ
మవ ప్రాప్తించును. ప్రాన్ కెంపు అనునపుడు ఆదేశ
సరళములు చేసిన ద్రుతమునకు బిందు సంశ్లేషములు రావ
ల! యుండుటచే "ఆదేశ సరళములకు ముందున్న......
విభాషనగు"—విభాష వలన నిషేధము కల్గినది.

ఈవిభాష ప్రాప్తవిభాష—అప్రాప్త విభాష-ప్రాప్తా
ప్రాప్త విభాష యని ముప్విధములు.

ప్రాప్త విభాషః— నిత్యముగా ప్రవర్తించు చున్న
కార్యమును వికల్పముగా విధించునది ప్రాప్తవిభాష.

ఉదా:— 'అనుకరణంబున తుదిహల్లునకు ద్విర్వచనంబగు' అను సూత్రముచే తుది హల్లునకు ద్విత్వము నిత్యముగా ప్రవర్తించుచుండ 'అనుకరణంబునందహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు'—అను సూత్రముచే విధింపఁబడుట ప్రాప్త విభాష.

అప్రాప్తవిభాషః— ఏ సూత్రము వలనను ఒక కార్య
మునకు ప్రాప్తి (ప్రవృత్తి) లేకున్నను వికల్పముగా విధించు
నది అప్రాప్త విభాష.

ఉదా:– "మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు"– చూడుము + నన్ను = చూడునన్ను; చూడుమునన్ను. ఏ విధముగను లోపమునకుప్రాప్తి లేక పోయినను వికల్పముగా లోపము విధించుటచే నిది అప్రాప్త విభాష.

ప్రాప్తాప్రాప్త విభాష:– లేక ఉభయత్రవిభాష:– ఏదేని ఒక కార్యము వికల్పముగా ప్రాప్తించుచుండ కొన్ని చోట్ల ప్రాప్తి లేకుండుటయు; మఱికొన్ని చోట్ల అంతకు ముందే నిత్యముగా ప్రవర్తించుటయు కల్గిన ఆ ప్రాప్తాప్రాప్తములకు తత్కార్యమును వికల్పముగా విధించునది ఉభయత్ర విభాష.

## నిపాతము :

"అన్యథా ప్రయోగే ప్రాప్తే అన్యథా ప్రయోగకరణం నిపాతః".

సామాన్యప్రక్రియ వలన ఒక రూపము ప్రాప్తించుచుండఁగా దానికి విలక్షణమైన ప్రయోగమును సూత్రకారుఁడు నిర్దేశించుటను నిపాతమందురు.

'ప్రాగ్రీశ్వరాన్నిపాతాః' 1–4–56 అను అధికారమున పాణిని ప్ర–పరా మున్నగు వానికి నిపాత సంజ్ఞను విధించెను. ఆ నిపాత సంజ్ఞను పురస్కరించుకొని 'స్వరాది నిపాతమవ్యయమ్' 1–1–37 అని అవ్యయ సంజ్ఞను–ఇంకను

'ప్రగృహ్యమ్' మున్నగు కొన్ని కార్యములు విధించి యున్నాఁడు. ఈ నిపాతములు పరిమితములు.

ఈ అంశమును గుర్తింపవలయును. వ్యాకరణ నిర్మాణము రెండు విధములుగ నుండును.

i ఎన్నియో పదములకు సాధుత్వమును జూపఁదలఁచి వానినన్నిటికి సమన్వయము కలుగునట్లు లక్షణములు రచియించుట.

ఉదా:- 'ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు'—ఇట్టి నిర్మాణమును కొంత బుద్ధిబలము కలవారే గ్రహింపఁగలరు. ఆసూత్రార్థమును గుర్తించి దానిని లక్ష్యములలో సమన్వయపఱచుట సామాన్యులకలవి కాదు. ఇట్టివి దీర్ఘపూర్వలో పధంబైన... . మున్నగు సూత్రములు.

ii) ఏశబ్దములకు వ్యాకర్త సాధుత్వమును ఏపద్ధతిలో ప్రక్రియా పూర్వకముగా చూపఁదలఁచెనో ఆప్రక్రియను చూపకుండ ఆసాధుశబ్దములకు తానే సూత్రమున సరాసరి ఉచ్చరించుట. ఇది సర్వజనసాధారణము.

ఉదా:- వేధ పురోధ పురోధసుఁడు.

సంస్కృతమున వేధస్ పురోధస్ అనునవి సకారాంత శబ్దములు. వీనిలో మొదటిదానికి సకారలోపము నిత్యముగాను, రెండవ దానికి వికల్పముగాను లోపము వచ్చి వేధ-పురోధ—పురోధసుఁడు అను రూపములు సాధు

వులగును. ఇట వ్యాకర్త ఎవ్విధమైనప్రక్రియను చూపకయే ఈ శబ్దములు సాధువులని నుడివెను.

సూరి చూపిన ప్రక్రియననుసరించి "ఒక విధమగు శబ్దము నిష్పన్నమగు చుండఁగానది సాధు శబ్దము కానిచో దానికి సాధుత్వములంభించునట్లు సూత్రకర్త సూత్రములో నుచ్చరించుటను కూడ నిపాత మందురు. ఈనిపాత శబ్దము నకే నిపాతనమనియు వ్యవహారము. కాని యీ నిపాత మనునది "ప్రాగీశ్వరాన్నిపాతాః" అను నిపాత వంటిది కాదు. అది సంజ్ఞా రూపము. ఇదివైయాకరణుల వ్యవహారము.

జ్ఞాతప్రవృత్తి నివృత్తిఃనిపాతః—ప్రవృత్తి నివృత్తులు సూత్రము వలననే జ్ఞాతమైన అది నిపాతమనఁబడును. సాధారణ విధికి సంబంధింపని ఒక శబ్దము యొక్క ప్రక్రియ యంతయు సూత్రముననే విధింపబడిన అది నిపాత యని పిండితార్థము.

ఉదా:— భువి—కద్రువ.

"పృథ్వీవాచిభూ శబ్దమునకుభువియగు" భూశబ్దమునకు "ఊకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు"—అను దానిచే వువర్ణకము వచ్చి భువు అనురూపము ప్రాప్తించు చుండ పృథ్వీవాచక భూశబ్దమునకు పై సూత్ర

మున 'భువి' యని నిపతింపఁబడినది. 'భూ' కు హ్రస్వము-'వి' వచ్చుట యను కార్యములు నిపాత వలననే సిద్ధించినవి. "నిపాతః పాదపూరణమ్."

## నిషేధము :

ఒక సూత్రముచే బహులక్ష్యసాధారణముగా కార్యము ప్రాప్తించుచుండఁగా దానికి అనిష్ట స్థలములలో ప్రవృత్తి నివారించుటకై ఆరంభింపఁబడుసూత్రము నిషేధసూత్రము. ప్రాప్తిలేనిదే నిషేధము వచింపఁబడదు. "ప్రాప్తిపూర్వకో హినిషేధః"—అని ఆర్యోక్తి.

ఉదా:— వచ్చి+ఇచ్చెను.

ఇచట 'క్రియా పదంబు లందిత్తునకు సంధివైకల్పికముగానగు—అనుసూత్రముచే సంధిప్రాప్తించి 'వచ్చిచ్చెను' అను రూపము సిద్ధించుచుండఁగా "క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు"—అను సూత్రముచే సంధి నిషేధింపఁబడినది. కాన యడాగమము వచ్చి "వచ్చియిచ్చెను" అని ఐనది.

## ప్రాయికము :

ఏకైక కార్య ప్రయోజనసాధకము ప్రాయికము. పలుచోట్ల సంధి జరుగుచు ఎక్కడైన ఒక చోట 'సంధి' వికల్పముగాఁగాని-జరుగక పోయినఁగాని సూత్రమున ప్రాయిక గ్రహణము గల్గును. సూరి దీనినే 'తఱచుగ'

అని కూడ నుడువుచుందురు. ప్రాయికమునకు బహుళమునకు కొంచెము భేదము కలదు. బహుళము బహుళ ప్రయోజన సాధకము. ప్రాయికము అన్యకార్యమును గ్రహింపలేదు. ఏక సూత్రగతము. ఒక కార్యము ఒక చోట నిత్యము-ఒక చోట వికల్పము-మఱియొక చోట నిషేధముగా కల్గిన దో నది ప్రాయికమని చెప్పనగును.

i) ఉదా:– ఖండబిందువు మీఁది సిద్ధచకారంబునకు ముత్తు పరంబగు నపుడు పకారంబు ప్రాయికంబుగానగు.

ఉదా:– తలఁపక–త్రేఁపక
ఇటు 'చ' కు 'ప' నిత్యముగా వచ్చినది.
ఏచు=ఏపఁక–ఏచఁక
ఇటు పై సూత్రముచే 'చ' కు 'ప' వికల్పముగా వచ్చినది.
'నోచు' ధాతువునకు సూత్రమందలి ప్రాయికగ్రహణము వలన 'చ' కు 'ప' నిషేధింపఁబడినది.

ii) 'అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగనగు'
అహో + అహో = నిత్యము.
ఏమి + ఏమి = ఏమేమి; ఏమియేమి.
ఇట్టి చోట్లవైకల్పిక సంధి సూత్రము నందలి తఱుచు గ్రహణము వలనఁగలిగినది.

## కారకము :

"క్రియాం కరోతీతి కారకమ్"

క్రియోత్పాదకము కారకము. క్రియాన్విత త్వం కారకత్వమ్మని; క్రియా నిర్వ_ర్తకమ్ కారకమ్మని; క్రియానిమి త్తం కారకమ్మని; క్రియా ప్రకారీభూతోర్థః కారకమ్మని; ధాత్వర్థాంశే ప్రకారో యః సుబర్థః సోఽత్ర కారకమ్మని; క_ర్తృత్వాది శ_క్తిమత్ కారకమ్మని క్రియాజనకత్వం కార కమ్మని పలువిధముల కారకనిర్వచనము. శాస్త్రమందు చేయఁబడినది. ఈకారకము షడ్విధము. క_ర్తృకారకము, కర్మకారకము, కరణకారకము, సంప్రదానకారకము, అపా దానకారకము, అధికరణకారకములు, షష్ఠీ విభ_క్తికిఁదక్క తక్కిన విభక్తులకు సంబంధించినవి. క_ర్తృకారకము— ప్రథమ = రాముఁడు-రావణుఁడు. కర్మకారకము—రాముఁడు రావణుని సంహరించెను. కరణకారకము—తృతీయ = ఖడ్గంబు చేతఖండించె.సంప్రదానకారకము—చతుర్థి = రామునికొఱకు కన్యనిచ్చెను. అపాదానకారకము—పంచమి= చోరునివలనభ యము.అధికరణకారకము-స_ప్తమీ=ఘటమందుజలమున్నది ఇఁకమిగిలినషష్ఠీవిభ_క్తి క్రియాన్వయములేనిదికనుక కారకము లేదు. అది సంబంధార్థబోధకము.

## ప్రాతి పదికార్థము :

"నియతోపస్థితికము ప్రాతిపదికము"

అని సూరి నిర్వచనము. ఆవశ్యకమైన ఉపస్థితికలది ప్రాతిపది కార్థమని యర్థము. "నియతోపస్థితికః ప్రాతిపది

కార్థః యస్మిన్ ప్రాతిపదికే ఉచ్చారితే యస్య అర్థస్య నియమేన ఉపస్థితిఃస తదర్థః ఇత్యర్థః—అని పాణినీయులు వచింపఁబడు ఏనామమునందే యర్థము నియమముగా (నియతముగా) ఉపస్థిత (జ్ఞాతము) మగునో అది ప్రాతిపదికార్థమని పై దాని కర్థము. ఈ ప్రాతి పదికార్థము అయిదు విధములు. జాతి—వ్యక్తి—లింగ—సంఖ్యా—కారకములు

"ఏకంద్వికం త్రికంచాథ "చతుష్కం పంచకం తథా
నామార్థ ఇతి సర్వేచ" పక్షాశ్శాస్త్రే నిరూపితాః"

ఈ ప్రాతి పది కార్థమున ప్రథమా విభక్తివచ్చును. "ప్రాతి పదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు" నని సూరి సూత్రము.

ఉదా:— రాముఁడు—రావణుఁడు

రామ అని పలికిన వెంటనే దశరథ సుతుఁడను స్ఫురణ కల్గినది. కాన ప్రాతిపదికార్థము. కనుక దానికి ప్రథమవచ్చినది

## కర్మ :

"ధాత్వర్థఫలాశ్రయంబు కర్మంబునాఁబడు"

అని సూరి ఉక్తి. ధాత్వర్థ (క్రియాజన్య) ఫలమునకాశ్రయమైనది కర్మకారకమని యర్థము. "కర్తురీప్సితతమంకర్మ" అని పాణినీయము.

అనఁగా కర్తకు క్రియ వలన నభీప్సితమమైనది కర్మ సంజ్ఞ నొందునని యర్థము. 'క్రియాజన్య ఫలశాలిత్వమ్ కర్మత్వ''మ్మని పాణినీయము. కర్తచేసెడి పనితో సంబంధించిన కారకము కర్మమని యర్థము. కర్మంబున ద్వితీయ యగునని సూరి సూత్రము. ఈ కర్మార్థమున ద్వితీయ వచ్చునని యర్థము.

ఉదా:– దేవదత్తుఁడు వంటకమును వండెను,
గోపాలుఁడు కృష్ణుని గొట్టెను.
దీనిలో కొట్టుట క్రియ. క్రియాఫలము దెబ్బ. దానికి ఆశ్రయ భూతుఁడు కృష్ణుఁడు. కనుక కృష్ణునికి కర్మసంజ్ఞ కల్గి ద్వితీయా విభక్తి వచ్చినది.

## కర్త :

"ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు"

ధాత్వర్థ క్రియ కాధార భూత మగునది కర్తయని యర్థము. స్వతంత్రః కర్తా 1–4–54. క్రియా ప్రవృత్తిలో స్వాతంత్ర్యము కలది కర్తయనఁదగును. "క్రియాయాం స్వాతన్త్ర్యేణ వివక్షితోఽర్థః కర్తాస్యాత్" –క్రియయందు స్వాతంత్ర్యము కలదిగా వివక్షింపఁబడునది యని యర్థము. ఈ కారకమునఁదృతీయా విభక్తివచ్చును. చేత వర్ణకంబు కర్తకగునని సూరిసూత్రము. "కర్తృకరణయో స్తృతీయా"

యని పాణినీయము. ధాత్వర్థ వ్యాపారాశ్రయత్వం కర్తృ త్వమ్మని పాణినీయము.

ఉదా:- దేవదత్తునిచే వంటకము వండఁబడియె.
వండఁబడుట క్రియ. దీనివ్యాపారమున కాశ్రయభూతుఁడు
దేవదత్తుఁడు. కనుక తృతీయ వచ్చినది.

## కరణము :

"క్రియా సిద్ధిం ప్రకృష్టోప కారకంబు కరణంబు"

అని సూరి నిర్వచనము. అనఁగాఁ గ్రియ సిద్ధించుటకు ముఖ్యకారణ భూతమైన సాధనము కరణమని యర్థము. "సాధక తమం కరణం క్రియాసిద్ధౌ ప్రకృష్టోప కారకం కరణం" అని పాణినీయులు. "యేన కర్తా కార్యం సంపాద యతి తత్ కరణమ్" అని నిర్వచనము క్రియా సిద్ధౌ ప్రకృష్టోప కారకత్వం కరణత్వమ్. అనఁగా కార్యసిద్ధి యందు కర్త కధికముగా సహాయపడు సాధనమే కరణమని యర్థము. "క్రియా సిద్ధౌ బహూని సాధనాని వ్యాప్రియన్తే తథాపి యత్ ప్రకృష్టోప కారకమ్ అంతరంగం వివక్షితం తదేవ కరణమ్" ఇత్యర్థః అనేక కారణముల మధ్య అన్య కారణ వ్యవహితము లేకయే హేతువు క్రియోత్పత్తి కార ణముగాఁజెప్పఁబడునో అది కరణమనఁబడును. ఈకరణము క్రియా మాత్ర విషయకము. వ్యాపార నియతమును నైనది.

"కరణత్వం తు క్రియా మాత్ర నియతం. వ్యాపార నియతం చ" అని పాణినీయము. ఈ కరణ కారకమునఁ దృతీయా విభక్తి వచ్చును. "కర్తృ కరణయో స్తృతీయా" అని పాణినీయము.

ఉదా:- కోల చేతఁ గూల నేసె

కూలనేయుట, అనుపనికి మిక్కిలి యుపయోగ పడిన సాధనము 'కోల' కనుక దానికి కరణ సంజ్ఞ కలిగి తృతీయా విభక్తి ప్రత్యయమగు 'చేత' వచ్చినది.

## హేతువు :

"ఫల సాధన యోగ్యంబగు పదార్థంబు హేతువు" అని సూరి వచనము "ఫల సాధన యోగ్యపదార్థః హేతుః" అనఁగా క్రియా ఫలమును సాధించుట కర్హమైన పదార్థము 'హేతువు' అని తెలియనగును. ఇది ద్రవ్య గుణ క్రియా సాధారణ మైనది. "ద్రవ్యాది సాధారణం నిర్వ్యాపార సాధారణంచ హేతుత్వమ్" అని పాణినీయము. అనఁగా ద్రవ్య గుణ క్రియలకు జనకమైన దాని యందు సాధారణ మైనదియు, నిర్వ్యాపార మైనదియు హేతువని యర్థము. ఈ హేత్వర్థమునఁ దృతీయా విభక్తి వచ్చును.

ఉదా:- విద్య చేత యశంబు గలుగు.

కీర్తి నందుటకుఁ దగిన పదార్ధము విద్య. కనుక అది హేతు సంజ్ఞక మైనది. కాన దానికిఁ దృతీయ వచ్చినది.

## ఉపయోగము :

"నియమ పూర్వక విద్యా స్వీకారము పయోగము" అనిసూరి నిర్వచనము. గురువునకు ప్రక్కగా కూర్చొనుట ఇత్యాదిశాస్త్రోక్త నియమములతో ఉపాధ్యాయుడుచ్చరించి నట్లు ఉచ్చరించుచు విద్య నభ్యసించుట ఉపయోగ మనఁ బగును. 'ఆఖ్యాతోపయోగే'—నియమ పూర్వక విద్యా స్వీకారే వక్తా ప్రాక్ సంజ్ఞః స్యాత్"—అని పాణినీయము. ఈ యుపయోగము నందు (ద్వితీయా విభక్తి వచ్చును. 'ఉపయోగంబు నందాఖ్యాత కుం దోడ వర్ణకంబగు' నని సూరి సూత్రము.

ఉదా:— రామ కృష్ణులు సాందీపని తోడ వేదంబులం జదివిరి. రామ కృష్ణులు సాందీపని వద్ద నియమ పూర్వకముగా విద్య నభ్యసించిరి కనుక యుపయోగము. ఈ యుపయోగ మున ఆఖ్యాతకు తోడ వర్ణకము కల్గి కరణకారకమైనది.

## సంప్రదానము :

"త్యాగోద్దేశ్యము సంప్రదానము"

అని సూరి వచనము. "త్యాగ జన్య స్వత్వ ఫల భాగిత్వమ్ సంప్రదానమ్" అని పాణినీయము దానమును గైకొనుట కెవఁడు నిర్దేశింపఁబడెనో వానికి సంప్రదాన సంజ్ఞ. "సంప్ర దీయతే అస్మై సంప్రదానమ్" అని

వృత్పత్తి. దానస్య కర్మణా య మభిప్రైతి ససంప్రదాన సంజ్ఞః స్యాత్" అని పాణినీయులు. చతుర్థీ సంప్రదానే–క్రియయా య మభిప్రైతి సోఽపి సంప్రదానమ్–అని పాణినీయులు. ఈ కారకమున చతుర్థీ విభక్తివచ్చును. క్రియచే దాన కర్మ కెవ్వఁడు ద్దేశింపఁ బడునో వాఁడు కూడ సంప్రదాన సంజ్ఞ నందునని పై సూత్ర భావము. "సంప్రదానంబునకుం జతుర్థి యగు" నని సూరి సూత్రము.

ఉదా:– జనకుండు రాముని కొఱకు ఁగన్య నిచ్చెను. కన్యను దానముగా నీయుటకు జనకునిచే నుద్దేశింపఁబడిన వాఁడు రాముఁడు. కనుక వానికి సంప్రదాన సంజ్ఞ కలుగ చతుర్థీ విభక్తి ప్రత్యయమగు కొఱకు వచ్చినది

## అపాదానము :

"ధ్రువ మపాయేఽపాదానమ్"

అని పాణిని సూత్రము. అపాయో విశ్లేషః. తస్మిన్ సాధ్యే ధ్రువ మవధి భూతం కారకమపాదానం స్యాత్–అని వృత్తి. అపాయ మనవిశ్లేషము-ఎడబాటు అనియర్థము. అట్టి విభాగము కలుగ నుండఁగా నిశ్చలముగా నుండునది. అనఁగా అట్టి యెడబాటునకు అవధి యగునది అపాదానమన నగును. "అపాదానే పఞ్చమీ" అని పాణినీయము. ఈ అపాదాన కారకమున పఞ్చమీ విభక్తి వచ్చునని యర్థము.

"అపాయ, భయ, జుగుప్సా, పరాజయ, ప్రమాద, గ్రహణ, భవన, త్రాణ, విరామాంతర్ధి, వారణంబు లెద్దానననగు, దానికి వలన వర్ణకంబగు" నని సూరి సూత్రము.

ఉదా:— మైత్రుండు రాజ్యంబు వలన భ్రష్టుండయ్యె.
పై ఉదాహృతిలో మైత్రుఁడు భ్రష్టుఁడగుటకు అవధి భూత మైనది రాజ్యము. మైత్రునికి రాజ్యమునకు విశ్లేషము కల్గినది. కనుక దానికి అవధి భూతమైన రాజ్యము అపాదాన సంజ్ఞ కలది యౌటచే పంచమీ విభక్తి వచ్చినది.

## శేషము:

'శేషంబనఁగా సంబంధంబు'

అని సూరి నిర్వచనము. అనఁగా స్వస్వామి భావాది సంబంధము కలది శేషము అనఁదగును. ఉక్తా దన్య శ్శేషః- అని పాణినీయము. చెప్పఁబడిన వాని కంటె భిన్నమైనది శేషమని యర్థము. షష్ఠీ విభక్తి ఈ శేషార్థమున వచ్చును. "షష్ఠీ శేషే= కారక ప్రాతిపది కార్థ వ్యతిరిక్తః స్వస్వామి భావాది సంబంధః శేషః, తత్ర షష్ఠీ స్యాత్" అని పాణినీయులు. కారక ప్రాతిపదికార్థముల కంటె వ్యతిరిక్తమై స్వ స్వామి భావాది సంబంధము కలది శేషమని పై దాని కర్థము.

ఉదా:- రాముని యొక్క గుణములు.

రాముని సంబంధమైన గుణములు. సంబంధార్థమున యొక్క వచ్చినది.

## నిర్ధారణము :

"జాతి గుణ క్రియా సంజ్ఞల చేత సముదాయంబు నుండి యేక దేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణంబనం బడు" అని సూరి వచనము. జాతి వాచకముచేఁ గాని, గుణ వాచకముచేఁ గాని, క్రియా వాచకముచేఁ గాని, డిత్థ-డవిత్థాది సంజ్ఞలచేఁ గాని విశిష్ట వస్తువులలో దాఁగి యున్న ఒక వస్తువును విభాగము చేయుట నిర్ధారణ మన నగును.

"యతశ్చ నిర్ధారణమ్" జాతి గుణ క్రియా సంజ్ఞాభిః సముదాయాదేక దేశస్య పృథక్కరణం నిర్ధారణం" అని పాణినీయులు. "నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకంబగు" నని సూరి సూత్రము.

ఉదా:- ఛాత్రుల లోపల మైత్రుండు సమర్థుండు.

ఇట శిష్యుల సముదాయము నుండి 'మైత్ర' అను సంజ్ఞతో మైత్రుఁడు వేఱు చేయఁబడిన వాఁడు. ఇట్లు వేఱు చేయుటకు హేతు భూతులగు శిష్యులకు నిర్ధారణ సంజ్ఞ కల్గి లోపల వర్ణకము వచ్చినది.

## అధికరణము :

"అధికరణంబునాధారంబు"

అని సూరి నిర్వచనము. ఆధార భూతమైనది అధికరణము. ఆధారోఽధికరణమ్. కర్తృ కర్మ ద్వారా తన్నిష్ఠ క్రియాయాః ఆధారః కారకమధికరణ సంజ్ఞం స్యాత్"అని పాణినీయులు. కర్తృకారకము వలనఁగాని, కర్మకారకము వలనఁగాని ఈ రెంటికి సంబంధించిన క్రియకు నాధారభూతమైనదధి కరణ మనఁబడునని పై దానికర్థము—

ఇది ఔప శ్లేషికము-వైషయికము-అభివ్యాపక మని త్రివిధము.

ఆధ్రియంతే అస్మిన్ క్రియాః ఇత్యాధారః

i) ఔపశ్లేషికము:— సామీప్య సంబంధముచే చేయఁబడిన ఆధారము ఔపశ్లేషికము. "ఉపసమీపేశ్లేషః సంబన్ధః తత్కృత మౌపశ్లేషికమ్" — ఇతివ్యుత్పత్త్యాసామీపికమేవ ఆధారత్వమౌపశ్లేషికమ్" అని పాణినీయము.

ఉదా:— ఘటమందు జలమున్నది.

జల ముండుటకు ఆధార భూతమైనది ఘటముకనుక దానికందు వర్ణకము కల్గినది.

ii) వైషయికము;— విషయ కృతమైనది

"విషయతా సంబన్ధ కృతః వైషయికః" అని పాణినీయము.

ఉదా:- మోక్షమందు ఇచ్ఛగలదు.
విషయ సంబంధముచే 'ఇచ్ఛ' మోక్షము నాధారము చేసి కొన్నందున మోక్ష శబ్దమునకందు ప్రత్యయము కల్గినది.

iii) అభివ్యాపకము:- సమస్తావయవముల యందు వ్యాపించి యుండుట కాశ్రయమైనది అభివ్యాపకము. "సకలావయవ వ్యాప్తికృత ఆధారః అభివ్యాపకమ్" అని పాణినీయము.

ఉదా:- తిలలందు తైలమున్నది.
తైలము తిలలను ఆధారము చేసి కొనుటచే అభివ్యాపక సంబంధమైన తిల శబ్దమున కందు వర్ణకము కల్గినది. 'సప్తమ్యధికరణేచ' అని పాణనీయము. 'అధికరణంబునకు సప్తమి యగు'నని సూరి సూత్రము. అధికరణ కారకమునకు సప్తమీ విభక్తి ప్రత్యయమగు 'అందు' వచ్చును.

## సమాసము :

"సమర్థంబులగు పదంబు లేక పదంబగుట సమాసంబు"

అని సూరి లక్ష్మము. "సమర్థః పదవిధిః సమాసః" అని పాణినీయము, సమ్యక్ అస్యంతే పదాని అస్మిన్నితి సమాసః అని వ్యుత్పత్తి. పరస్పరాన్వయముగల అనేక పదములు ప్రత్యయాదులు విడువబడి సంక్షేపముగా నొకే రూపము నొందుట సమాస మనఁదగును, సూరి శబ్దాను శాసనమున "అన్వయంబునం బదంబుల యైక్యంబు సమాసం బండ్రు"

అని అన్వయ సహిత పదముల ఐక్యమే సమాసమని నుడివి నాఁడు. "పృథగర్థానాం ఏకార్థీ భావస్సమాసః" అని పాణినీయము.

ఇట్లు సమాసము నొందుటకు పదములకు సమర్థత కావలయును. సామర్థ్యమునకు రెండువిధములుగా నర్థము చెప్పవచ్చును. 1. పృథగ్వ్యాఖ్యాతంబులగు నర్థంబులకేకార్థము నందు వృత్తి సామర్థ్యము. 2. పృథక్ప్రసిద్ధార్థములగు పదములకేకార్థము నందు వృత్తి సామర్థ్యము. పృథగర్థానాం ఏకార్థీభావః సమర్థవచనమ్ — అనేకార్థములేకార్థమగుట సామర్థ్యము. 2. పృథగర్థానాం పదానాం ఏకార్థీభావస్సమర్థ మిత్యుచ్యతే—ప్రక్రియాదశ యందు ప్రసిద్ధార్థములు గల పదములు సామూహికముగా ఏకార్థమగుటను జెందుట సామర్థ్యము. అనఁగా ప్రసిద్ధార్థములును, భిన్న భిన్నార్థములును గల రెండు శబ్దములు గలిసి యొకే యర్థమును బోధపఱచు శబ్దముల సమాసములని చెప్పవచ్చును. ఈ సామర్థ్యము రెండు విధములు. వ్యపేక్షా సామర్థ్యము. ఏకార్థీభావ సామర్థ్యము. వ్యపేక్షా సామర్థ్యము: స్వార్థ పర్యవ సాయినాం పదానాం ఆకాంక్షాది వశాత్ యః పరస్పరాన్వయః తత్ వ్యపేక్షారూప సామర్థ్యమ్" అని పాణినీయము. సమాసము నందలి పదములు తమ తమ అర్థములు కల్గినవై ఆకాంక్షావశము వలనఁ బర

స్వరాన్వయము గల్గుట వ్యపేక్ష యనఁదగును. ఇది వాక్యమునందే కాని వృత్తియందు ఆశ్రయింపబడదు. ఏకార్థీ భావ సామర్థ్యము:— ప్రక్రియా దశయందు ప్రత్యేకార్థము గల పదములకు సముదాయ శక్తిచే విశిష్టమగు ఏకార్థమునే ప్రతిపాదించునది ఏకార్థీభావ సామర్థ్యము. ఇది సమాసాది వృత్తులందు ఆశ్రయింపఁబడును. ఈ సమాసము మూఁడు విధములుగా నుండును "సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర భేదంబుచే సమాసంబు త్రివిధంబని" సూరి సూత్రము సాంస్కృతికంబని — ఆచ్ఛికంబని — మిశ్రంబని — సమాసంబు త్రివిధంబని వివరణము.

## సాంస్కృతిక సమాసము :

"త్రివిధా సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర భేదాత్ — సాంస్కృతికో ద్వివిధస్సిద్ధసాధ్యశ్చేతి" అని సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము. ఈ సమాసము సిద్ధము సాధ్యమని రెండు విధములు.

సిద్ధ సమాసము : కేవల సంస్కృత శబ్దంబుల సమాసంబు సిద్ధంబునాఁబడు" అని సూరి వివరణము. కేవల సంస్కృత శబ్దముల సమాసము అట్లే తెలుఁగున ప్రవేశించునది సిద్ధము. అనఁగా ప్రకృతిపదముల సమాసము సిద్ధమనిఅర్థము.

ఉదా:— రాజ్ఞ్య-తటాకోదకము :

## సాధ్యసమాసము :

"సంస్కృత సమంబుల సమాసంబు సాధ్యంబునాఁబడు"

అని సూరి సూత్రము. తెలుఁగు వ్యాకరణ శాస్త్రముచే సంస్కృత పదములకు, తెలుఁగు వికారము చేర్పఁబడిన పదములకగు సమాసము. అనఁగా ఁదత్సమ పదములకగు సమాసము సాధ్యము.

ఉదా:— రాజునాజ్ఞ—తటాకంబునుదకంబు
ఇట రాజు—అజ్ఞ అను రెండు సంస్కృత సమములగుటచే సాధ్యము.

## ఆచ్ఛికసమాసము :

"తెనుఁగుల సమాసంబాచ్ఛికంబనంబడు"

అచ్చ తెనుగు పదములకగు సమాసము ఆచ్ఛిక సమాసమని యర్థము. "కేవల వికృతి పదంబులతోడిది సమాసకంబు" అని శబ్దానుశాసనము. శబ్ద లక్షణ సంగ్రహము నందలి సూత్రము. "కేవల వికృతిపదైర్యస్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః" అని చింతామణీయము. ఈ రెంటినిబట్టి ఆచ్ఛిక సమాసమునకు సమాసకమను నామాంతరము కలదని తెలియనగును. పై సూత్రములలోని వికృతి పదమునకు తద్భవమని, అచ్చ తెనుఁగని అర్థము.

ఉదా:- తేనియానతి—చెఱువుసిరు—సిరి చెలువుఁడు మొ॥ వి

ఇట్లు తేఁడు—అనతి రెండు అచ్ఛికము లౌటచే అచ్ఛిక సమాసము.

## మిశ్రసమాసము :

"ఉభయంబులు కూడినది మిశ్రంబనఁబడు"

సంస్కృత—అచ్ఛిక పదములతో కూడిన సమాసము మిశ్రసమాసమని యర్థము."ప్రకృతి వికృతి పదంబులదిమిశ్ర సమాసము" అని సూరి శబ్దానుశాసనము, శ. ల. సంగ్రహమునను గలదు. సంస్కృత వైకృత శబ్దైర్మిశ్రసమాసస్స ఏవవిజ్ఞేయః" అని చింతామణీయము. తత్సమ శుద్ధాచ్ఛి పదములతోఁడి సమాసము మిశ్ర సమాసమని యర్థము.

ఉదా:- రాజు ముతల—చెఱువు నుదకము.

## తత్పురుష సమాసము :

"తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ
సంస్కృతోక్తంబయగు"

అని సూరి వచించెను. ఉత్తరపదార్థ ప్రధానస్తత్పురుషః" అని భాష్యము. ఉత్తర పదార్థము ప్రధానముగాఁ గలది తత్పురుష మని యర్థము. తస్యపురుషః తత్పురుషః అని వ్యుత్పత్తి. ఈ సమాసము బహు సంబంధ

ములుగల శబ్దముల కూడిక—ఇది వ్యధికరణము—సమానాధి
కరణమని ద్వివిధము.

## వ్యధికరణ సమాసము:

"ద్వితీయాదులకు మీఁది పదంబుతోడ సమాసంబు
వ్యధికరణంబు నాఁబడు" అని సూరి వివరణము. ద్వితీయాది
విభక్తులకు నుత్తర పదముతోడి సమాసమే వ్యధికరణ
మనఁదగును.

ఉదా:— ద్వితీయాతత్పురుష:- నెలతాల్పు
తృతీయా తత్పురుష:- నెల తక్కువ వాఁడు
చతుర్థీ తత్పురుష :- దేవరమేలు
పంచమీ తత్పురుష :- దొంగభయము
షష్ఠీ తత్పురుష :- రామునిబాణము
సప్తమీ తత్పురుష:- మాటనేర్పరి
నెలను తాల్చిన వాఁడు—ఇట ద్వితీయకు నుత్తరపదమగు
తాల్పుతో సమాసము. ఇట్లే తక్కినవియు నూహ్యంబులు.

## సమానాధి కరణము (లేక) కర్మధారయము:

"విశేషణంబునకు విశేష్యంబు తోడ సమాసంబు

సమానాధి కరణంబు నాఁబడు"—ఇదియె కర్మధార
యంబు నాఁబడు"—అని సూరి వివరణము. విశేషణమునకు
విశేష్యముతోడి సమాసము సమానాధికరణము లేక కర్మ

ధారయమని యర్థము. సమానాధి కరణమనఁగా సమాన మైన అనఁగా ఒకే ఆధారము గలదియని యర్థము. సమాన పదములయొక్క ధర్మముల కాధారము సమానమని యర్థము. "తత్పురుష స్సమానాధికరణః కర్మధారయః" 1-4-42 అని పాణినీయము. సమానాధి కరణమైన తత్పురుషమే కర్మ ధారయమని యర్థము. "కర్మక భేదక క్రియాం తాం ధరయతి అసౌ కర్మధారయః" అని వ్యుత్పత్తి. కర్మకమనఁగా విశే షణ క్రియ. ఈ క్రియను ధరించునది కాన కర్మధారయ సమాసము. ఉత్తర పదార్థ ప్రధానము ప్రాయికము గాఁగల సమాసము కర్మధారయమన వచ్చును, "సంస్కృత పదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి"—అని చింతామణీయము. సంస్కృతపదముతో పరిమితమైన ఆంధ్ర పదమే కర్మధారయమని యర్థము.

ఉదా:— సరసపువచనము-తెల్లగుఱ్ఱము మొ। వి. ఇచ్చట వచనము అను విశేష్యము సరసమను విశేషణముతో సమసించినది కనుక కర్మధారయము.

## ద్విగుసమాసము:

"సంఖ్యాపూర్వో ద్విగుః" 2—1—52

అని పాణినీయము. సంఖ్యా పూర్వంబు ద్విగువు నాఁబడు నని సూరి నిర్వచనము. సంఖ్యారూపమైన విశేష ణమునకు విశేష్యంబుతోడి సమాసంబు ద్విగువు. అనఁగా

సంఖ్యా పూర్వకమైన కర్మధారయమే ద్విగువని భావము. "ఆచ్ఛికస్సు ద్విగోరేక వచనం ప్రాయశః నిత్యం సంఖ్యో త్తరస్య" అని సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమునఁ గలదు. "ద్విగువునకేక వచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రమంబునకుఁ గాదు" అని బాల వ్యాకరణసూత్రము.

ఉదా:– ముజ్జగములు–ముల్లోకములు
జగము అను విశేష్యము మూఁడు అను సంఖ్యావిశేషణ పూర్వమైనది కనుక ద్విగు సమాసము.

## బహువ్రీహి సమాసము:

"అన్య పదార్థ ప్రధానము బహువ్రీహి"

"అన్య పదార్థ ప్రధానో బహువ్రీహిః" అని భాష్య కారుని వచనము. సమాసమందు కూర్పఁబడిన పదముల యొక్క అర్థము ప్రధానముగా గలిగి ఆ పదములకు సంబంధింపని అన్యార్థమును ప్రధానముగ బోధించునది బహువ్రీహి సమాస మనఁదగును.

"శేషోబహువ్రీహిః" 2-2-23, అనేక మన్యపదార్థే 2-2-24. అని పాణినీయము. ఉక్తాదన్యశ్శేషః-"చెప్పఁబడిన దాని కంటె నితరమైనది. అనఁగా ప్రథమా విభక్తికి చేయఁబడు సమాసము బహువ్రీహియని యర్థము. స్త్రీసమ ఘటితంబ యొకానొకండు బహువ్రీహిమాపత్తైను" నని

సూరి సూత్రము. అనఁగా సమాసము లోని రెండు పదము లును స్త్రీ సమఘటితంబులై యుండునని యర్థము.

ఇవి కేవలాచ్ఛిక పద సమసనమునకే వర్తించును.

ఉదా:– ముక్కంటి– వేగంటి మొ॥ నవి.

సమాస ఘటితములగు మూఁడు–కన్ను–రెండు పదములు స్త్రీ సమములు.

## ద్వంద్వ సమాసము :

"ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము"

"ఉభయ పదార్థ ప్రధానో ద్వంద్వః"

సమాసములోని పూర్వోత్తర పదములు రెండును ప్రాధాన్యము గల సమాసము ద్వంద్వసమాసమని యర్థము. పరస్పరాన్వయము గల రెండు పదములు గాని అంతకు మించిన పదములుగాని అర్థప్రాధాన్యము గల్గి క్రియతో నన్వయించునది ద్వంద్వ సమాస మనఁదగును. "చార్థే ద్వంద్వః" 2–2–29. అనేకంసుబన్తం చార్థే వర్తమానం వాసమస్యతే సద్వన్ద్వః అని పాణినీయు. చకార ద్యోతిత మైన ఇతరేతర యోగ సమాహారముల వర్తించు సుబంత ములు వికల్పముగా సమసించును. అదిద్వంద సమాసమగు నని యర్థము.

"ఆచ్ఛికశబ్దంబు తోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు"—

అని సూరి సూత్రము. దీనినే శబ్ద లక్షణ సంగ్రహ మున కూడ స్త్రీ సమంబు వికృతి పదంబుతో ద్వంద్వం బగునని వచించెను. అనఁగా ద్వంద్వములో పూర్వపదము స్త్రీసమముగా నుండునని యర్థము.

ఉదా:— తల్లిదండ్రులు - అన్నదమ్ములు - ఊరువల్లెలు మొ॥ తల్లి దండ్రులు వచ్చిరి. అనుచోట తల్లి-తండ్రి అను రెండు పద ములు సమ ప్రాధాన్యము కలిగి క్రియతో నన్వయించుటచే నిది ద్వంద్వము.

## వృత్తి :

"పరార్థాభిధానం వృత్తిః"

విగ్రహ వాక్యావ యవ పదార్థేభ్యః పరః అన్యః యోయం విశిష్టైకార్థః తత్ ప్రతిపాదికావృత్తిరిత్యర్థః— అని పాణినీయులు నుడివిరి. విగ్రహ వాక్యావయవములైన అనేక పదములు ఐక్యము నొంది తమ స్వార్థములను వర్జించి తద్వ్యతిరిక్తమగు విశిష్టార్థమును (సమూహార్థమును) ప్రతి పాదించునది వృత్తియనిభావము. ఈ వృత్తి ఐదు విధములు. 1. కృద్వృత్తి 2. తద్ధిత వృత్తి 3. సమాసవృత్తి 4. ఏకశేష వృత్తి 5. సనాద్యన్తధాతువృత్తి. కృత్తద్ధిత సమాసైకశేష

సనాద్యన్త ధాతురూపాః పఞ్చవృత్తయః "కర్మధారయంబు సంఖ్యాసమంబుల కాలుశబ్దము పరంబగునపుడత్వంబునకుత్వం బును రుగాగమంబునగు"—అనుసూత్ర వివరణమున "ఇచట వృత్తియందాలు శబ్దము స్త్రీమాత్రపరమ" ని సూరి చెప్పెను. ఇటవృత్తియనసమాసవృత్తియని అర్థము.

ఉదా:– రాజ పురుషుఁడు = ఇది సమాసవృత్తి. రాజ్ఞః పురుషః అను పదములు ఏకీభావము నొంది కేవలము రాజును గాని కేవలము పురుషునిగాని బోధింపక విశిష్టార్థమును అనఁగా రాజసంబంధియగు పురుషుని బోధించుటచే నిది సమాస వృత్తి. సమాసాదుల అర్థావబోధనము గావించునదే విగ్ర హము. "వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః" అని పాణినీయులు.

## ఉపసర్జనము:

"ప్రథమా నిర్దిష్టం సమాస ఉపసర్జనమ్" 1-2-43

సమాసశాస్త్రే) ప్రథమా నిర్దిష్టము పసర్జన సంజ్ఞం స్యాత్ అని పాణినీయము. సమాస విధాయిక సూత్రము లలో ప్రథమా విభక్తితో నిర్దేశింపఁబడిన దుపసర్జనమన నగును. ఈ ఉపసర్జనము సమాసమున పూర్వపదముగనే యుండవలయును. "ఉపసర్జనం పూర్వమ్" 2—2—30 అని పాణినీయము. "ఏక విభక్తి చాఽపూర్వనిపాతే" 1—2—44 విగ్రహేయన్నియత విభక్తికం తముపసర్జనం స్యాత్ నతు

తస్య పూర్వనిపాతః"అని పాణినీయులు. విగ్రహ వాక్యమున నొకే విభక్తికలది ఉపసర్జన మనఁదగునని భావము.

ఉదా:— "ఆచ్ఛిక శబ్దంబులోఁద స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు"—

ఇది సమాస విధాయక సూత్రము. దీనిలో ప్రథమా విభక్తితో నిర్దేశింపఁబడినది "స్త్రీసమంబు" అనునది కనుక ఇది "ఉపసర్జన" సంజ్ఞకమగును. అపుడు 'ఉపసర్జనం పూర్వమ్' అను సూత్రముచే సమాసమున స్త్రీసమమును పూర్వముగనే యుంచవలయును. ద్వంద్వ సమాసము నందలి పూర్వ పదము స్త్రీసమముగా నుండవలెనని యర్థము.

## అవ్యయము :

"లింగ విభక్తి వచన శూన్యాని అవ్యయాని"

అని పాణినీయము. "సదృశం త్రిషులింగేషు సర్వాసు చ విభక్తిషు" వచనేషుచ సర్వేషుయన్నవ్యేతి తదవ్యయమ్ అని భాష్యోక్తి. లింగ విభక్తి వచన శూన్యములు అవ్యయములు. న+వ్యయము=అవ్యయము. వ్యయము కానిది. క్షతిలేనిది యని యర్థము. త్రిలింగములును సప్తవిభక్తి ప్రత్యయములును, వచన ద్వయమును లేనిది — అవ్యయ మనఁదగును. ఈపై వానిలో మార్పుఁజెందక; క్షతిలేక ఉండునది కనుక అవ్యయమను పేరు సార్థకము. ఇది ద్వివిధము.

1, ప్రతి పదోక్తము:"ప్రతి పదముచ్చార్య ఉక్తమ్ ప్రతిపదోక్తమ్." అనఁగా సహజముగా నున్నవి.

2. లక్షణికము:- "లక్షణేన శాస్త్రేణ నిష్పన్నమ్ లాక్షణికమ్" శాస్త్రము చే ఉత్పన్నములైనవి లాక్షణికావ్యయములు. ఇవి ధాతూత్పన్నములు క్త్వార్థక చేదాద్యర్థక ఆనంతర్య తుమున్నర్థక—శత్రర్థ-వ్యతిరేకక్త్వార్థము లాక్షణికావ్యములు.

ఉదా:— అహా-ఔర-ఊరక-మిన్నక-బళి-పోలెన్ మొ॥ నవి కూర్చి-గురించి-ఉండి-పట్టి-అదిగో-ఇదిగో.
సూరి సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమున 'అప్రభృతీని అవ్యయాని' అనియు, శ ల. సంగ్రహమునను శబ్దానుశాసనమునను ·ఏవార్థకాదులవ్యయంబు' లనియు సూత్రీకరించెను. "స్వరాది నిపాత మవ్యయమ్"- సర్వాది గణ ఫలిత శబ్దములు, నిపాతములును అవ్యయ సంజ్ఞకముల నఁదగును.

## అవ్యయీభావసమాసము:

"పూర్వ పదార్థ ప్రధానోఽవ్యయీ భావః"

అని పాణినీయులు. పూర్వపదార్థము ప్రధానముగాఁగలది అవ్యయీభావ సమాసము. అవ్యయం సమర్థేన సహాస మస్యతే సోఽవ్యయీ భావః అనవ్యయం అవ్యయం

భవతీతి అవ్యయీభావః. ఖండములుగా నున్న పదములన ఖండముగాఁ జేయఁగల పదముతో అవ్యయము సమసించిన అది అవ్యయీభావ సమాసమనఁదగును. సహజముగా నవ్యయములుకాని శబ్దములు ఈ సమాసములోఁ బ్రవేశింపఁగా మొత్తమన్వయమగుచున్నది. 'అవ్యయీ భావశ్చ' 1–1–41 అని పాణినీయము. సమాసములలో ఈ సమాసమును సూరి చెప్పక పోయిన పైని జేర్కొన్న అతని లక్ష్యములను బట్టి చెప్పుట జరిగినది. "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు"–అను సూత్రమునకు లక్ష్యములుగా 'ఎల్లయర్థములు, ఎల్ల కలుషములు' అని ఇచ్చెను. దీని వివరణమున "సర్వపర్యాయంబైన ఎల్లశబ్దము ద్రుతాంతంబైన యవ్యయంబు. దీనికసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు"–అని చెప్పుటను బట్టి సూరికి అవ్యయీభావ సమాసము సమ్మతమే అని తెలియు చున్నది.

## తద్ధితము :

"తద్ధితాః"– 4–1–76.

అని పాణినీయము. సుబొజన్ మున్నగు సుబంతములకు త్వార్థమునందు, మతుబర్థమునందు వచ్చు ప్రత్యయములు తద్ధితములు. "తస్మైహితమ్ తద్ధితమ్" అని వ్యుత్పత్తి తస్మై= వాని కొఱకు అనఁగా ప్రకృత్యర్థ భిన్నార్థ స్వార్థి

కార్థముల కొఱకు; హితమ్=మేలైనది తద్ధితమని యర్థము. వర్ణకాంతములైన త్యార్థమునందు స్వార్థమునందు తన నర్థకము కల్గు భావార్థమందు కలవాఁడు—కలదియును నర్థములనిచ్చు మతుబర్థములందు (అస్త్యస్మిన్నితి మతుప్) చేయఁబడు ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములని చెప్ప నగును. తేభ్యః హితాః తద్ధితాః—ప్రయోగముల కొఱకు హితమైనవి అనఁగా ప్రయోగములను సాధించునది. ఈ రీతిగా కాశికావృత్తికారుఁడు నిర్వచనము చేసినాఁడు. కాని భాష్యకారుఁడు ఈ నిర్వచనము చేయలేదు.

"తద్ధిత మూఢోఽవైయాకరణః
తద్ధిత సూఢో వైయాకరణః"

అని ఆర్యోక్తి. తద్ధిత మూఢుఁడు వైయాకరణుఁ డనియు, తద్ధితలను సూఢము చేసికొన్న వాఁడే వైయాకరణుఁడని ఆర్యోక్తి. లక్షణ శాస్త్రమున వీని కంతటి ప్రాశస్త్యము కలదు.

ఉదా:- చిన్నతనము, ఆటకాఁడు, జాలరి, అరమరిక మొ॥ ఇటు చిన్నతనము అనునపుడు భావార్థమున తద్ధితప్రత్యయముగు తనము వచ్చినది. ఇట్లే తక్కినవియు నూహ్యంబులు.

## భావము :

"ప్రకృతి జన్యబోధంబునందు ప్రకారంబుభావంబు"

అని సూరి వచనము. నామ సంబంధమగు నర్థములో విశేషణముగా తోచు ధర్మము భావమని యర్థము. సంస్కృతమున ఈభావార్థమును తెలుపునది త్వప్రత్యయము. 'తస్య భావ స్త్వతలే'అని పాణినీయము. తెలుఁగున భావార్థక ప్రత్యయము 'తన' అనునది తన వర్ణకంబు త్వార్థంబు నందగు. "త్వార్థంబనగా భావంబు"అని సూరి వ్రాక్రుచ్చెను. "త్వార్థే తనక్" అని సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణము. "తనము భావంబునందు సర్వంబునకగు"—నని శబ్దలక్షణ సంగ్రహము నందలి సూత్రము.

ఉదా:— రాముని తనము — సీతతనము—గొప్పతనము. రాముని యొక్క ధర్మము అను భావార్థమున తనవర్ణకము వచ్చి ముప్రత్యయము చేరి రామునితనము ఐనది.

## మతుబర్థము :

కలవాఁడు—కలది యను అర్థబోధకంబైనది మతుబర్థమని చెప్పనగును. "తదస్య అస్త్యస్మిన్నితి మతుప్" అని పాణినీయము, శ్లో॥ భూమనిన్దా ప్రశంసాసునిత్యయోగేஉతిశాయనే॥ సంసర్గేஉస్తి వివక్షాయాం భవన్తి మతుబాదయః"—అని పాణినీయులు. భూమనింద ప్రశంసార్థముల యందు మతుప్రత్యయము వచ్చుననిభావము. తెలుఁగున ఈ మతుబర్థమును సూచించునవి, కా, కత్తియాది వర్ణకములు. కా, కత్తియాది వర్ణ కాంతములై కలవాఁడు-కలది యను

నర్థబోధకములు మతుబర్థములని వచింప వచ్చును. "అవి మత్వర్థంబునందగు" నని శబ్దలక్షణ సంగ్రహము. "అత్వా మిత్వా ముత్వంబు సమాసంబున మత్వర్థంబులంద్రు"—అని సూరి శబ్దాను శాసనమున విశదీకరించెను.

ఉదా:— చెలికాడు—చెలికత్తియ-జాలరి-ఒయారి-దాకిత-వగలాడి. ఇట చెలిమి కలవాడు అను అర్థమున 'కా' ప్రత్యయము వచ్చినది కనుక మతుబర్థము.

## కృదంతము :

"ధాతువునకు విహితంబగుడుఙ్ భిన్న ప్రత్యయంబు కృత్తునాబడు"

అని సూరి వాక్కు. అనగా క్రియాపదములపై చేరు డుఙ్-రు-వు-రు-ను-ముఙ్ల కంటె భిన్నమగు ప్రత్యయములు కృత్తులనబడును. డుకృఙ్ ధాతువునకు క్విప్ ప్రత్యయము చేరగా 'కృత్' అగును. ఇది అంతమందు కలది కృదంతమనబడును. కృదతిఙ్ 3—1—93— అని పాణినీయము తిఙ్ ప్రత్యయములుకాక మిగిలిన ప్రత్యయములు కృత్తులని యర్థము.

ఉదా:— అలుక—అక-చేత-మాపు-మనుపు-అప్పన మొ॥వి. అలుగు అను ధాతువుపై కృత్ప్రత్యయమగు కవర్ణకముచేరి 'అలుక' యని కృదంత రూపమైనది. ఇట్లే తక్కినవి ఊహ్యములు.

## క్రియ :

క్రియయన వ్యాపారము. ధాతువు. "క్రియా ధాతుః" అనఁగా క్రియ–ధాతువు ఈ రెండును సమానార్థకములు. "క్రియతే ఇతి క్రియ" చేయఁబడునది క్రియ. "కారకాణామ్ ప్రవృత్తి విశేషః క్రియా" కర్తృ కర్మాది కారకముల వ్యాపార విశేషమే క్రియయనఁదగును.

'యావత్సిద్ధమసిద్ధంస్యాత్ సాధ్యత్వే వాభిధీయతే
ఆశ్రిత క్రమ రూపత్వాత్ సాక్రియేత్యభిధీయతే'
ఉత్పన్న మైనది (భావము) కాని ఉత్పాదకమైన (భావము)గాని ఆశ్రితక్రమరూపమున సాధ్యముగాఁ జెప్పఁబడినచో అది "క్రియ" అని చెప్పనగునని భావము. సంస్కృతమున ఈ క్రియకు ఆఖ్యాతమను నామాంతరము కూడఁగలదు. "క్రియా వాచకం ఆఖ్యాతమ్–భావ ప్రధాన మాఖ్యాతమను వాక్యములు గలవు.

ఉదా:– చేసెను–వండెను–పోయెను. మొ॥ వి.
అతఁడు వంటకములను వండెను. ఇది కర్మకారకము. వంటకమును వ్యాపారమును దెలియఁజేయునది 'వండెను' కనుక క్రియ.

## అధికారము :

"ఏకత్ర ఉపాత్తస్య అన్యత్ర వ్యాపారః అధికారః"

ఒకచోట చెప్పఁబడిన దయ్యు మీఁది సూత్రములలోఁగూడ ప్రవర్తించునది అధికారము. తానున్నచోట సంపూర్ణ మను అర్థమును జెప్పకుండ తను తరువాత యున్న విధి సూత్రములతో నేక వాక్యతను బొంది యర్థమును బోధించుట యధికారము.

"స్వస్థలే వాక్యార్థ బోధాజనకత్వేసతి
ఉత్తర సూత్రైకతాపన్న బోధాజనకత్వంఅధికారత్వం"

ఒకచోట నియమితమై; అర్థ బోధక శక్తి కల్గియు ఆతరువాత సూత్రములలోని కనువర్తించి యట సంపూర్ణార్థ బోధను గల్గించునది అధికారము. స్వరితేనాధికారః-1-3-11 దేనిపై స్వరిత చిహ్నముండునో అది అధికారమును దెలియఁజేయును.

ఉదా:- ధాతువునకు, ఇది అధికార సూత్రము. నియమితమైన స్థలమునమండి అర్థబోధకశక్తి కల్గించుచున్నను సంపూర్ణార్థ బోధకము గాదు; కనుక దాని తరువాతి దగు 'వర్తమానంబునలట్టగు' అను సూత్రములోని కనువర్తించి 'వర్తమాన క్రియా వృత్తి యగు ధాతువునకు లట్పర్ణకంబగునని' స్పష్టార్థమును కల్గించినది.

## వర్తమానార్థకము :

"వర్తమానంబునాఁ ప్రారబ్ధాపరిసమాప్తంబు"

అని సూరి వచనము. ప్రారబ్ధాపరి సమాప్తత్వం వర్తమానత్వం'' అని పాణినీయము. అప్పటికి ముగియ కుండునది వర్తమానము. ఆరంభింపఁబడి జరుగుచున్న కాల మును దెలుపుక్రియ వర్తమానార్థకము. ప్రారబ్ధమనఁగా ప్రారంభింపఁబడినది. అపరి సమాప్తమనగానప్పటికిముగియ కుండునది. ఏ పనిని ప్రారంభించునో ఆపని ముగియు వఱకు ఈ మధ్య యుండెడి కాలమంతయు వర్తమానకాలమే! ఇట్లు చెప్పుటకుఁ బ్రయోజనములు చాల కలవు. ఒఁకడు ఏదో యొక రోజు చదువు ప్రారంభించి పదేండ్ల పాటు చదువును. ఈ మధ్య కాలమున అతనిని అడిగిన అతఁడు చదువకుండక భోజనము చేయునపుడు ప్రయాణము చేయు చున్నపుడు నేను చదువుచున్నాను అనువర్తమానకాలముతో సమాధానము చెప్పును. కాని నిజముగా వాఁడు అప్పుడు చదువుట లేదు. ఇట్టి స్థితిలో వర్తమాన ప్రత్యయమెట్లు. కాని చదువుట అనే క్రియ ముగింపుకున్నందున పది సంవ త్సరముల పాటు ఆ క్రియ జరుగుచున్నదనే భావించి వర్త మాన ప్రత్యయము చేయవచ్చును. ఇట్లే ఒకఁడిల్లు కట్టుట ప్రారంభించును. రెండు సంవత్సరములో మూఁడు సంవత్స రములో కట్టుటకు పట్టును. అయినను ఈ కాలమంతయు వర్తమాన కాలముగనే భావించును. కనుక సూరి 'అప్పటికి ముగియ కుండునది యని వివరించెను ముగిఁయునంత వఱకు

అది వర్తమానమే! ముగిసిన తరువాత వర్తమానము కాక పోవచ్చును.

ఉదా.— అతఁడు వచ్చుచున్నాఁడు, ఇటు వచ్చుచున్నాఁడు. అనునది జరుగుచున్న కాలమును దెలుపుచు ముగియ కుండుటచే వర్తమానార్థకము.

## భూతార్థకము :

"భూతంబునా విద్యమానధ్వంస ప్రతియోగి"

అని సూరి వివరణము "భూతత్వంచ విద్యమాన ధ్వంస ప్రతి యోగిత్వం"— అని పాణినీయము. ముందుండి అప్పటికి లేకుండునదని యర్థము. జరిగిన కాలమును దెలి యఁజేయుచు వర్తమానమున లేనిది భూతార్థకమననగును. దీనినే క్త్వదర్థమందురు.

ఉదా:— వండెను — వండితిని

ఇటు 'వండెను' అనునది ముందు జరిగిన కాలమును దెలుపు చున్నది కనుక భూతార్థకము.

## భవిష్యదర్థకము :

"భావినా విద్య మాన ప్రాగభావ ప్రతియోగి"

అని సూరి మాట. అప్పటికి పుట్టకుండునది యని యర్థము. "భావిత్వంతు విద్యమాన ప్రాగభావ ప్రతి యోగిత్వ" మ్మని పాణినీయము. జరిగిన, జరుగుచున్న;

దానిని గాక రాఁబోవు దానిని గూర్చి తెలియఁజేయునది భవిష్యదర్థకము.

ఉదా:— రాఁగలఁడు—వండఁగలఁడు
ఇచ్చట 'రాఁగలఁడు' ఎపుడో? జరుగఁబోవుదానిని బోధించుటచే భవిష్యదర్థకము.

## తద్ధర్మార్థకము :

"వికృతౌ ధాత్వర్థ మాత్ర ప్రాతి పదిక స్తద్ధర్మః"

తెలుఁగులో ధాత్వర్థమును మాత్రమే బోధించు ప్రాతిపదికమే తద్ధర్మమని భావము. "తస్యధాతోః ధర్మః తద్ధర్మః" అని వ్యుత్పత్తి. దాని యొక్క అనఁగా ధాతువు యొక్క ధర్మము తద్ధర్మమని యర్థము. భూతభవిష్యద్వర్తమానముల కంటె భిన్నమైన అర్థము కలది తద్ధర్మము. "భూతాద్యర్థ త్రయ విలక్షణః కశ్చిదర్థః తద్ధర్మః" అని అహోబలపతి వివరణము.

ఉదా:— వండును-చేయును—వండుదురు ఇత్యాదులు.
'వండును' అనునది భూత భవిష్యద్వర్తమానముల కంటె భిన్నార్థమును దెలుపుటచే తద్ధర్మార్థకము.

## ప్రత్యాహారము :

"ఆదిరన్త్యేన సహేతా" 1—1—71

అంత్యేన ఇతా సహిత ఆదిః మధ్యగానాం స్వస్యచ సంజ్ఞాస్యాత్" అని పాణినీయులు. అంత్యమగు ఇద్వర్ణము లతోఁ గూడిన ఆదివర్ణము. మధ్యగల వర్ణములకునుతనకును సంజ్ఞయైనచోనది ప్రత్యాహారము. అనఁగా మొదటి వర్ణము చివరి యక్షరమును గలుపుకొని పలుకఁబడి మధ్యగల వర్ణ ములను గూడబోధించునదియై ప్రత్యాహారసంజ్ఞ నొందును.

ఉదా:– 'లకారంబునకు డుబ్రువురను మున్గారు'
ఇట డుఞ్ అనునది ప్రత్యాహారము. ఆది వర్ణమైన డుఅను నది అంత్య వర్ణమగు ఞ్ తో కలసి మధ్యగల వర్ణములకును దనకును ప్రత్యాహార సంజ్ఞనొందినది. డుఞ్ అను ప్రత్యా హారములో డుఞ్ – రు-వు-రు-ను-ము అను అక్షరములు గలవు.

## భావార్థకము :

"భావంబనఁగా ధాత్వర్థంబు"

అని సూరి వివరణము. "టవర్ణకంబు భావంబు నందగున"ని సూరి లక్ష్మము. ధాత్వర్థ వ్యాపారాశ్రయ మున క్రియకుటవర్ణకము వచ్చిన అది భావార్థకమగునని అర్థము. ఇది భావః క్రియా-ధాత్వర్థశ్చ ధాతునైవ ఉచ్యతే య స్తస్య సిద్ధతా నామధర్మ స్తత్రఘఞాదయః ప్రత్యయాః విధీయంతే (కాశిక 3–3–18)

ఉదా:— చేయుటు-కొట్టుటు
చేయు అను ధాతువునకు భావార్థకమున 'టు' వచ్చినది. ధాత్వర్థ వ్యాపారాశ్రయమున క్రియకు 'మిజి' వచ్చిన 'వ్యతిరేక' భావార్థక మనఁదగును. "వ్యతిరేక భావంబున మిజి యగు' నని సూరి సూత్రము. దీనినే శబ్ద లక్షణ సంగ్రహమునను జెప్పెను.

ఉదా:— వండమి-తినమి
వండు ధాతువునకు మిజి వచ్చి వ్యతిరేక భావార్థకమైనది.

## క్త్వార్థము :

"ఏకాశ్రయంబులగు క్రియలలో నెయ్యది పూర్వ కాలికంబగుఁదద్వాచియగు ధాతువునకు 'ఇ' వర్ణకంబగు." ఇదియె క్త్వార్థంబునాఁబడు"—నని సూరి నిర్వచనము.

ఏక కర్తృత్వము గల రెండు క్రియలలో ఇవర్ణకము చేరిన పూర్వ కాలికమగు క్రియ. క్త్వార్థమని చెప్పఁబడును. ఇది భూతకాలిక క్రియ. "సమాన కర్తృకయోః పూర్వకాలే" 3–4–21 "సమాన కర్తృకయోః ధాత్వర్థయోః పూర్వకాలే విద్యమానాద్ధాతోః క్త్వాస్యాత్"— అని పాణినీయులు-సమాన కర్తృకములైన ధాత్వర్థములలో పూర్వకాలికమైన ధాతువునకు క్త్వాప్రత్యయము వచ్చునని యర్థము. పాణినీయాను సారముగా సమాన కర్తృకములైనచో చైత్రుని చేత మైత్రుండు కొట్టంబడిమడిసె.

ఇత్యాది ప్రయోగంబులసాధువులు గావలసి వచ్చును. దానికై సూరి సమానాశ్రయంబులని సూత్రములోఁజెప్పి వృత్తిలో వివరించెను. పై వాక్యమున కొట్టినఁవాడు మైత్రుఁడు-మడిసిన వాఁడు మైత్రుఁడు. భిన్న కర్తృత్వమట స్పష్టము. కాని కొట్టఁబడిన వాఁడును, మడిసిన వాఁడును మైత్రుఁడగుటచే సమానాశ్రయ మిట సుసంపన్నమైనది. ఈ క్త్వార్థమును తెలుఁగున 'ఇ' వర్ణకముగా విధించిరి కనుక తెలుఁగున క్త్వార్థమను నామ మిడిరి.

ఉదా:- వచ్చి+ఇచ్చెను=వచ్చియిచ్చెను.
వచ్చు-ఇచ్చుఅను రెండు క్రియలు ఏకకర్తృత్వము గలవి. ఇందు 'వచ్చుట' అను పూర్వకాలికమగు క్రియగాన దానికి 'ఇ' వర్ణకము వచ్చి క్త్వార్థకమైనది.

వ్యతిరేకక్త్వార్థకము : "కజి వ్యతిరేక క్త్వార్థంబునందగు"నని సూరి వచనము వ్యతిరేకక్త్వార్థ బోధక ప్రత్యయము 'క' అనునది. అనఁగా క్త్వార్థము కంటె వ్యతిరేకమైన అర్థమున ధాతువునకు 'కజి' చేరునని యర్థము. ఏకాశ్రయము గలిగిన రెండు క్రియలలో ముందు జరిగిన క్రియకు 'కజి' వచ్చునని యర్థము.

ఉదా:- అతఁడు చదువక పోయెను.
పూర్వ కాలిక మగు చదువు ధాతువునకు 'కజి' వచ్చి వ్యతిరేకక్త్వార్థకమైనది.

## తుమున్నర్థకము :

"తుమున్ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయాం" 3-3-10

అని పాణినీయము. "క్రియాయాముపపదే ధాతోః తుమున్ణ్వులేస్తః" క్రియ ఉప పదముగా నున్నపుడు ధాతువునకు తుమున్ణ్వుల్ ప్రత్యయములు వచ్చును. "సమాన కర్తృకేషు తుమున్"3-3-158 ఇదికృత్ప్రత్యయము. అనేక కర్తలు గల వాక్యమునందు తద్వ్యాపారమును దెలుపు ముఖ్యమైన క్రియా బోధకమగు ధాతువునకు 'అన్' ప్రత్యయము కల్గును. అనఁగా అన్యక్రియాజనకమునకు ఏ క్రియ హేతువో ఆ క్రియ తుమున్నర్థకమనఁదగును. భావార్థకమున విధింపఁబడిన సంస్కృతము నందలి తుమున్ ప్రత్యయము తదర్థముననే ఈనుజీ విధింపఁబడినది. సంస్కృతమందలి తుమర్థంబుననే ఈ నుజీని విధించుటచే తుమర్థకమను పేరుసార్థకము.

"తుమర్థ భావ లక్షణంబుననుజీయగునని" సూరి సూత్రము.

ఉదా:- చైత్రుండు వండను బోయెను.
వండుట-పోవుట యనునవి భావార్థక క్రియలు. వీనిలో ముఖ్యమైన క్రియకు అనఁగా పోవుట అనుక్రియోత్పన్నమునకు కారణ భూతమైనది వండు ధాతువు. దానికి నుజీవచ్చి 'వండను' అని తుమున్నర్థకమైనది.

## ఆత్మనేపదార్థము :

"క్రియా ఫలంబు కర్తృగామి యగుచో కొనుధాతువను ప్రయుక్తంబగు" ఇదియేఆత్మనేపదార్థమనివ్యవహరింతురు"- అని సూరి వివరణము. క్రియాఫలము ఫలభూతమగునపుడు కర్తనే ఆశ్రయించినట్లుండిన క్రియకు 'కొను' ధాతువు అను ప్రయుక్తంబగుట ఆత్మనే పదార్థమని చెప్పనగును. క్రియా ఫలము ఆత్మను అనఁగా కర్తను పొందుటను బోధించు పద ములు కనుక ఆత్మనే పదార్థములని పేరు వచ్చినది. స్వరిత ఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే—స్వరితే తో ఞితశ్చ ధాతోః ఆత్మనే పదంస్యాత్ "కర్తృగామిని క్రియాఫలే"—అని పాణి నీయులు. స్వరితమిత్తుగాఁగల ధాతువునకు ఞకార మిత్తుగా ఁగల ధాతువునకు క్రియాఫలము కర్తనాశ్రయించిన యెడల ఆత్మనే పదమువచ్చునని యర్థము. "తఙానావాత్మనేపదమ్" 1—3—12 అని పాణినీయము. తఙ్ ప్రత్యాహారము లోని త- ఆతాం- ఝ- థాస్- ఆథామ్- ధ్వమ్- ఇట్- వహి- మహిఙ్ అనునవియు, ఆన (శానచ్-కానచ్) అనునదియు ఆత్మనే పద సంజ్ఞకములగును.

ఉదా:— అతఁడు అన్నమును వండుకొనుచున్నాఁడు.

ఈ వాక్యమున వండుకొనుటయను క్రియాఫలము 'అతఁడు' అను కర్తనాశ్రయించుటచే వండు ధాతువునకు కొను అను ప్రయుక్తమై ఆత్మనే పదార్థమైనది.

## ప్రేరణార్థకము :

ప్రేరణ మనఁగా ప్రేరేపించుట. ఒకఁడొకపనిని మఱి యొకనిచే చేయించుట ప్రేరణమని యర్థము. ఈ అర్థమున వచ్చు 'ఇంచుక్-చు' ప్రత్యయములుయుక్తమగు క్రియయే ప్రేరణార్థకమనఁబడును. సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు "చుగాగమం బాచ్ఛికంబునకి సంయుక్త నలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు" అను సూత్రములలో సూరిచే ప్రేరణార్థక ప్రత్యయములు విహితములు. సంస్కృతమున ప్రేరణార్థ బోధక ప్రత్యయము ణిచ్. దీనిని ణిజంతమనియు ణ్యర్థమనియు కూడ నందురు.

ఉదా:- రామునిచే ఫలమును తినిపించెను.
తినిపించెను, అనునది ప్రేరణార్థకము. రాముని ఫలమును తినుమని ప్రేరేపించెనని యర్థము.

## చేదర్థకము :

కార్యకారణ భావమే చేదర్థకము. ఇది భూత భవిష్యదర్థములలో నుండును. సంస్కృతమున 'చేత్' అను నవ్యయమేయర్థమును బోధించునో ఆ యర్థముననే తెలుఁగున ఏని మొదలగు ప్రత్యయములు విధింపఁబడినవి. వీనినే చేదర్థకము లందురు. ఈచేత్ అనునది సంస్కృతమున "చేద్యద్యర్థే-

పక్షాంతరే—అసందేహేఽపి సందిగ్ధతయా కథనే చ" అని సంస్కృత నిఘంటువు ఏని—ఆ-అయినచో-చో అనునవి తెలుఁగున చేదర్థక బోధకములు. సూరి "చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకము ద్రుతాంతం బగు" నని 'నన్' అనునది చేదర్థ బోధక ప్రత్యయము గానుడివినాఁడు. ఒక క్రియకు హేతువగు అన్యక్రియయొక్క ఉత్పత్తి సందేహాస్పదముగా నుండుట. అనఁగా కారణ భూతమగు క్రియ అప్పటికి పుట్టకుండుట.

ఉదా:— వానలు కురిసినం బంటలు పండును.

పంటలు పండుటకు హేతువు వానలు కురియుట—కారణ భూతమగు క్రియ సందిగ్ధముగ నున్నది. కనుక చేదర్థకమై ద్రుతాంతంబైనన వర్ణకము చేరినది. వానలు కురిసినచో పంటలు పండునని యర్థము.

## ఆనంతర్యార్థకము:

అవ్యవహితము అనఁగా వ్యవధానము లేక వెంటనే గోచరించుట. ఒక క్రియ జరిగిన వెంటనే తత్కారణ క్రియ స్ఫురించినచో నది ఆనంతర్యార్థకము. అనంతర భావము ఆనంతర్యము. క్రియ—కారణక్రియ ఈ రెండు వ్యవహితము లేక అంటియుండవలెను. అల్పవ్యవధానము కలవి యగును. ఈ ఆనంతర్యార్థకమును బోధించు ప్రత్యయము ద్రుతాంతంబైన 'డు' అనునది. "ఆనంతర్యంబున డు వర్ణకంబు

ద్రుతాంతంబగు" నని సూరి సూత్రము. ఇదియే శబ్దలక్షణ సంగ్రహమున చెప్పఁబడియె.

ఉదా:— జాబిలితోఁ తెంచుడుం గువలయంబులు వికసిల్లె.
జాబిల్లి వచ్చిన వెంటనే కువలయంబులు వికసిల్లినవి జాబిల్లి వచ్చుట, కువలయములు వికసించుట, ఈ రెండును వెంట వెంటనే జరుగుటచే వికసించుటకుఁ గారణభూతమైన "తోఁతెంచు" అను క్రియకు ద్రుతాంతంబైన 'డు' వచ్చి అనంతర్యార్థకమైనది.

## తృజర్థకము:

సంస్కృతమునందలి తృచ్ ఏయర్థము విధింపఁబడి నదో ఆయర్థమునఁ దెలుఁగు ధాతువునకు వచ్చు ప్రత్యయము తృజర్థకము. ణ్వుల్ తృచౌ 3–1–133 అని పాణినీయము. సంస్కృతమున ధాతువు కంటె కర్త్రర్థమున తృచ్ విధింప బడినది. కనుక తెలుఁగున తృజర్థమున కర్త్రర్థకమని యర్థము. ఈ అర్థమున వచ్చు ఎడి–ఎడు ప్రత్యయములే తృజర్థకములు. "తృవర్ణకార్థంబునందు ఎడి ఎడువన్నియలగు" నని సూరి సూత్రము.

ఉదా:— ప్రహరించెడు వాఁడు–ప్రహరించెడివాఁడు. ఈ ఎడి-ఎడులకు లోపము కలిగినపుడు ప్రహర్త అగును. ఈ తృజర్థమే వ్యతిరేకార్థమును బోధించునపుడు నిజి వచ్చును. 'వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజియగు' నని సూరి లక్ష్మము.

ఉదా:— వందనివాఁడు.

కర్త్రర్థకమై వ్యతిరేకార్థబోధక మగుటచే నిడి వచ్చినది.

## శత్రర్థకము :

సంస్కృతమున వర్తమానార్థమున శతృ ప్రత్యయము విధింపఁబడినది. తెలుఁగున తదర్థమున నే ధాతువునకు ద్రుతాంతంబైన 'చువర్ణకము' వచ్చును. ఇదియే శత్రర్థ మనఁబడును. "చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు"నని సూరి సూత్రము. చువర్ణకంబు శత్రర్థంబునందగునని శబ్దలక్షణ సంగ్రహము నందలి సూత్రము. సంస్కృతము నందలి శత్రర్థమున వచ్చు కర్త్రర్థక ప్రత్యయము కనుక శత్రర్థక మని యనఁబడుచున్నది. "లటః శతృశానచౌ అప్రథమాసమానాధికరణే" 3-2-124. అని పాణినీయము. ప్రథమా సమానాధికరణము లేనపుడు వర్తమాన కాలమున లట్ స్థానమున ధాతువునకు శతృ శానచ్‌లు వచ్చునని యర్థము.

ఉదా:— చూచు చుంబోవు చున్నాఁడు.

పోవుచున్నాఁడు అనునది ఇపుడుజరుగుచున్న పనిని దెలుపు చున్నది కనుక తదర్థమున చూచు అను ధాతువునకు 'చున్' చేరి శత్రర్థకమైనది.

## శబ్దపల్లవము :

"ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణా
ర్థాభిధాయకంబులగునేని యవి శబ్ద పల్లవంబులునాఁబడు"

అని సూరి లక్షణము. ధాతువునకు ధాతువుగాని, నామవాచకమునకు ధాతువుగాని కూడి విలక్షణార్థము అనఁగా భిన్నమైన యర్థమును బోధించు శబ్దము శబ్దపల్లవమని చెప్పనగును. పల్లవము వంటి శబ్దము కనుక శబ్ద పల్లవమను పేరు కల్గినది. పల్లవమన చిగురుటాకు-కొమ్మ నుండి ఆకు పుట్టినను దాని గట్టితనమును, రంగును చిగురుటాకునకు సంప్రాప్తింపక తద్విలక్షణమగు ఎరుపుఁదనము మేళవించినట్లే ధాతువునకు ధాతువను ప్రయుక్తమైనపుడు విలక్షణార్థము నిచ్చుచున్నది కనుక శబ్ద పల్లవమను సార్థక సంజ్ఞనందినది.

ఉదా:— ఊరకనే కూరుచుండెను.
ఇట కూరుచు అను ధాతువునకు ఉండుట అను ధాతువను ప్రయుక్తమై పీనికంటె విలక్షణమైన ఆసీనుడగుట అను నర్థమును బోధించుటచే నిది శబ్దపల్లవము.

ఉదా:— అఁకొను=అఁకలి+కొను.
అఁకలి అను నామముపై కొను ధాతువను ప్రయుక్తమై 'అఁకలి' పొందు అను విలక్షణార్థ బోధకమగుటచే నిది శబ్దపల్లవమైనది.

"ధాత్వాదులకు ధాతువులనుప్రయుక్తములై యర్థాంతరాభిధాయకంబులగునవి శబ్ద పల్లవములని శబ్ద లక్షణ సంగ్రహము.

## దఘ్నార్థకము :

"దఘ్నార్థంబున బంటి కొలందులగు"

దఘ్నమన లోతు అని యర్థము. లోతును దెలుపు శబ్దమునకు 'బంటి-కొలందులు' అను ప్రయుక్తములగును. బంటి-కొలంది ఇవి దఘ్నార్థబోధక ప్రత్యయములు.

ఉదా:- మొకాలిబంటి-తొమ్ము కొలది మొ॥వి.
మోకాలి లోతున మునింగి యున్నాడని యర్థము-కనుక దఘ్నార్థకము. మోకాలి ప్రమాణమని యర్థము.

## పరిమాణార్థకము :

"మానార్థంబునకే కత్వంబునం దేడు వర్ణకంబగు"

పరిమాణ మన కొలంతను దెలియంజేయునది. తద్వాచక ప్రత్యయము ఎండు అనునది. ఈ ప్రత్యయము అను ప్రయుక్తమైన శబ్దము పరిమాణార్థక మనంబడును. ఎండు వర్ణకంబు పరిమాణంబునందగు" అని శబ్దలక్షణ సంగ్రహము.

ఉదా:- మానెండు-వీసెండు-కుంచెండు
మానిక పరిమాణము గల ద్రవ్యమును దెలుపు చున్నది కనుక 'ఎండు' ప్రత్యయము చేరినది.

## భావలక్షణార్థము :

"భావలక్షణంబు నాన్ అన్య క్రియకు లక్షణ
భూతంబగు క్రియ"

అని సూరి సూక్తి. ఒక వ్యాపారము అన్య వ్యాపారమునకు లక్ష్యమును సూచించునది ఐనచో నది భావలక్షణ మనఁదగును. అనఁగా ఒక ధాత్వర్థమున కొక ధాత్వర్థము చిహ్నమగుట భావలక్షణమనఁబడునని యర్థము. "తుమర్థ భావలక్షణంబున నుజీ యగు" నని సూరి సూత్రము.

ఉదా:— మైత్రుండు వందనతితి వచ్చెను.
వచ్చుట అను క్రియకు 'వందుట' అను క్రియ లక్షణ భూతమైనది కనుక భావలక్షణము. కనుక నుజ్ వచ్చి వందన్ ఐనది. "యస్యచ భావేన భావలక్షణమ్" 2–3–37 అని పాణినీయము.

## వ్యతిరేకార్థకము :

క్రియా ఫలమున కనను కూలమైనది. అనఁగా క్రియా వ్యాపారమునకు వ్యతిరేకమైన వ్యాపారము గల క్రియ వ్యతిరేక క్రియ. తదర్థ బోధకమగునది వ్యతిరేకార్థకము. దీనిని ప్రతిషేధ క్రియ అని కూడ అందురు. "ప్రాధాన్యేన విధేర్యత్ర ప్రతిషేధః"—అనఁగా నిషేధవిధికి ప్రాధాన్యము కలిగి నఞ్ శబ్దము క్రియ నన్వయించుట ప్రతిషేధము.

ఉదా:— ఒల్లక–కొట్టక–తిట్టక మొ॥వి

## సత్వము :

"సుబంత వాచ్యంబు సత్వంబు నాఁబడు"

అని సూరి వివరణము. సుబంతముచే అనఁగా నామ విభక్త్యంత మందుఁగల శబ్దములచే వక్ష్యమాణమగు డు-ము-వు మున్నగు విభక్తి ప్రత్యయములు చేరునది సత్వ మనఁదగును. సుబంతము ద్రవ్యార్థ బోధక సమర్థమైనది. క్రియయైనచోనట్లుగాదు. వ్యాపార బోధకము కనుక సుబంత వాచ్యము సత్వమైనది. ఈ సత్వాభిధానంబున ధాతువునకు భవద్భావిశత్రు క్తవదర్థములలో ఉన్న-కలజీ-నవర్ణకంబులు ప్రాప్తించును. ఇవి నామ వాచకములకు విశేషణములుగ నుండును.

ఉదా:- వండు చున్నవాఁడు-వఁడఁగలవాఁడు-వండినవాఁడు ఇట 'వండుచున్నవాఁడు' అను చోట ద్రవ్యము యొక్క విశేషణమును దెలుపుచున్నది కనుక సత్వము.

## నిత్యము :

"కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు"

అని సూరి ఉక్తి. ఒక కార్యము చేసినను చేయకున్నను అన్యకార్యమ్మునకు ప్రసక్తి ఉన్నచోనది నిత్యమనదగును.

ఉదా:– జయించు. ఇట జి + ఇంచు అనునపుడు ,,ఇ ఉ ఋ లకిం చుక్కు పరంబగు నప్డు యుగవుగిరుక్కులగు' అను దానిచే అయుక్ వచ్చును. 'ఇరు విరహితంబులై... అను దానిచే ఇయుట్ వికల్పముగా వచ్చును. వికల్పవిధిని నిత్యవిధి బాధించునని తెలిసినను అయుక్ప్రసక్తి కల్గుటచే నిది నిత్యము. కృతా కృత ప్రసంగి నిత్యమ్మని మూలము.

## సకర్మకము :

కర్మకాంక్షోత్థాపికము సకర్మకము. కర్మకు ఆకాంక్షా జనకమైన ధాత్వర్థము సకర్మక మని భావము. ఏధాత్వర్థము కర్మను బోధించుటకు ప్రశ్నాజనక మగునో అదిసకర్మకము.

ఉదా:– బాలుఁడు పాఠములను చదివెను.
ఇట చదివెను అను క్రియ ఏమి చదివెను? అను ప్రశ్నను కల్గించి పాఠములను కర్మను బోధించుటచేనిది సకర్మక వాక్యము.

## అకర్మకము :

"కర్మకాంక్షానుత్థాపకము అకర్మకము"

అని సూరి వివరణము. కర్మకు ఆకాంక్షాజనకము గాని ధాత్వర్థము అకర్మక మనదగును. అనఁగా కర్మను తెలుపుటకు ప్రశ్నాజనకము కాని ధాత్వర్థమని యర్థము.

ఉదా:— పంటలు పండెను.

ఈ వాక్యమున పండెను అను క్రియా పదము దేనిని వేనిని అనుప్రశ్నాజనకము కాలేదు కనుక యిదిఅకర్మకవాక్యము.

## విశేషణము :

"విశినష్టి ఇతివిశేషణమ్"

విశేషమును జెప్పునది విశేషణమని యర్థము. విశేష్యతే అనేనవిశేషణమ్. భేదకం విశేషణం భేద్యం విశేష్యం" విశేషణమునకు భేదకమని నామాంతరము. ఒక వస్తువును మఱొక వస్తువు కంటె వేఱుచేయునది. ధర్మ గుణ క్రియాదులచే విశేష్యమును విశేషణము భేదించుటచే భేదకమనఁదగును. ఒక శబ్దము వలన బోధకమగు నర్థము వ్యాకృత పఱిచి చెప్పు అన్య శబ్దమే విశేషణమని చెప్పనగును.

ఉదా:— గుణవంతుఁడు రాముఁడు.

రాముని ధైర్య పరాక్రమాది గుణములను గుణవంత శబ్దము తెలుపుటచే నిది విశేషణము.

## లింగము :

లింగమన గుఱుతు-చిహ్నమని యర్థము. ఇది త్రివిధము—పుంలింగము—స్త్రీలింగము-నపుంసకలింగము. ఆయా చిహ్నములను బట్టి ఆయా లింగ నిర్ణయము తత్సమమునఁ జేయఁబడినది. పురుష చిహ్నమును దెలియఁజేయునది

పుంలింగము. అట్లే స్త్రీచిహ్నమును బట్టి తెలిసికొనఁదగినది స్త్రీ లింగము. ఈ రెంటి సామ్యము సంకేతముగాఁగలది నపుంసకలింగము. సంస్కృతమున సత్త్వరజస్తమోగుణముల యొక్క ఉపచయాపచయాద్యవస్థలఁబట్టి ఈ లింగ నిర్ణయము చేయఁబడినది. సత్త్వోపచయము పుంలింగము. సత్త్వగుణాపచయము స్త్రీ లింగము. సత్త్వసామ్యమున నపుంసక లింగము చేయఁబడినవి.

"నస్త్రీపుమాన్ నపుంసకమ్"

అచ్చ తెలుఁగున ఈ లింగ నిర్ణయము లేదు కాఁబట్టి మహద్వాచకములని, అమహద్వాచకములని నన్నయ ద్వివిధముగా విభాగము కావించెను. "స్త్రీపశు జడాన్ వినాన్యే మహదాఖ్యాః-తద్విశేషణాశ్చాపి-" అని నన్నయభట్టీయము. స్త్రీ పశు జడములమహత్తులని వీని కంటె భిన్నములమహత్తులని—వీని విశేషణములు అమహన్మహత్సంజ్ఞలను పొందునని చెప్పెను. అహోబలపతి—చిన్నయ్యాలు మహతీ వాచకములను గల్పించిరి. అయినచో ఈ త్రివిధములు సంస్కృతములో వలె శబ్దాశ్రయములు కావు. అర్థాశ్రయములు. కేవల శబ్దార్థమును బట్టి మహదమహన్మహతీ వాచకముల నొనరించిరి.

## డుమంతము :

"డుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతంబనంబడు"-

నని సూరి లక్షణము. ఇది సూరి విహిత సంజ్ఞ. డుః అస్య అ_స్తీతి డుమత్, అని వ్యుత్ప_త్తి. డు కలది డుమంతము కనుక నిది సార్థక సంజ్ఞ. ప్రథమా విభ_క్తి ప్రత్యయమగు 'డు' వచ్చుటకు యోగ్యమైన తత్సమాచ్ఛిక నామములు డుమంతములు. "పుంలింగంబైన మహద్వాచకంబునకు డుజగు" అను దానిచే డుజ్ విహితము. ఈ డుజ్ చేయుటకు సిద్ధముగా నున్న శబ్దము డుమంతశబ్దమని యర్థము.

ఉదాః— రాము,—రాముఁడు

ఇటు డుజ్ చేరుటకు యోగ్యమైన "రాము" అనునది డుమంతము.

## లోపము :

"అదర్శనం లోపః"

'ప్రస_క్తస్య అదర్శనం లోప సంజ్ఞం స్యాత్' అని పాణినీయము. ప్రా_ప్తమైన వర్ణము యొక్క అదర్శనమే లోపమనఁదగును. అనఁగా వర్ణవినాశమే లోపమని భావము. "అదర్శన మశ్రవణ మనుచ్చారణమ్" అనుపలబ్ధిరభావో వర్ణ వినాశ ఇతి అనర్థాంతరమ్"—"ఏతైః శబ్దైః యోఽర్థో ఽభిధీయతేతస్యలోప ఇతీయం సంజ్ఞా" భవతి. అర్థము

వలనఁగాని, సూత్రము వలన గాని ప్రసక్తములగు ప్రత్యయాదుల యొక్క ఉచ్చారణా భావమే లోపము.

'ప్రత్యయ లోపే ప్రత్యయలక్షణమ్' అను న్యాయము వలన ప్రత్యయ లోపము కల్గినప్పటికి తన్నిమిత్తముగా ప్రాప్తించు కార్యములు నిరాటంకముగా ప్రాప్తింపవచ్చును.

ఉదా:- వచ్చెను+గోవులు = వచ్చెగోవులు
ఇట 'ద్రుతమునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు' అనుసూత్రముచే ద్రుతము అదృశ్యమై వచ్చెగోవులు ఐనది.

## గుణము :

"అదేఙ్గుణః"

"అత్, ఏఙ్ చ గుణ సంజ్ఞం స్యాత్" అని పాణినీయము. హ్రస్వాకారమునకు ఏ-ఓ అను వానికి గుణమని సంజ్ఞ. "అ-ఏ-ఓ- ఈ మూడును గుణంబులనాఁబడు" నని సూరి వచనము. "ఆద్గుణః" "అవర్ణాదచి పరే పూర్వపరయోః ఏకః గుణః ఆదేశః స్యాత్" అని పాణినీయులు. అకారమునకచ్చు పరముగా నున్న పూర్వపరముల స్థానము గుణము ఏకాదేశమగునని యర్థము. అనఁగా అకారమునకు ఇ-ఉ-ఋ-లు పరంబగు నపుడు ఏ-ఓ-అర్ అనునవి ఆదేశముగా వచ్చునని భావము. దీనినే ఇంచుక్కప్రిస్తకిలో

"ఋస్థానికంబగు గుణంబు రపరంబయి యుండు. సంస్కృత ధాతూపధలకు ఇ-ఉ-ఋ అను వానికి సొరిదిని ఏ-ఓ-అర్ అనునవి యించుక్కు పరంబగునపుడగునని యెఱుంగునది." —అని విశదీకరించినాఁడు. "సంస్కృతంబునకలఘూపధంబునకు ఇంచుక్కు పరంబగునపుడు గుణంబగు"— అని సూరి సూత్రము.

ఉదా:— ఇకి–ఏ వచ్చుటకు=ఛిద్+ఇంచు=ఛేదించు.
ఉకి–ఓ వచ్చుటకు=ఘుష్+ఇంచు=ఘోషించు.
ఋకి–అర్ వచ్చుటకు=వృష్+ఇంచు=వర్షించు.
పరమేశ్వరః–సూర్యోదయః - బ్రహ్మర్షిః–సంధిలో ఏ–ఓ అ లు వచ్చిన వానికుదాహృతులు.

## త్రికము :

"ఆ-ఈ-ఏ యను సర్వనామంబులు త్రికమునాఁబడు"

అని సూరి శాస్త్రము. ఈ త్రికము అనునది అన్వర్థ సంజ్ఞయే. ఇదియు సూరి కల్పిత సంజ్ఞ. త్రి=అను మూటి యొక్క సమూహమే త్రికమని యర్థము. "తదాద్యాస్త్రియస్త్రికః" అని సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణములోని సూత్రము. కర్మధారయ సమాసమున త్రికముపూర్వపదమై యుండుట ఒక లక్షణము.

ఉదా:— ఆ చందము–ఈ చిందము–ఏ బృందము.

ఈ పై సమాసమున త్రికము విశేషణముగా నుండి విశేష్య ముతో సమసించినది.

'త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు'

అ+కన్య=అక్కన్య :

ఈ+విధము =ఇవ్విధము :

ఏ+తెఱఁగు=ఎత్తెఱఁగు మొ॥ నవి.

## మఃజ్ఝు :

"మధ్యమ ముదుజ్ఝులు ముజ్ఝునాఁబడు"

"లూణ్మధ్యమ పురుషలకు ముదుజ్ఝులగు"—అని సూరి సూత్రములు. ఈ సంజ్ఞయు సూరి కల్పితమే. ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూడ్వర్ణక మగును. ఇట్టి లూట్ మధ్యమ పురుషైకవచనమగు'వు'కుఁము, అనునది వచ్చును. బహువచన ప్రత్యయమగు 'రు' 'కు' 'డుఁ' అనునది వచ్చును. ఇట్లు వచ్చిన ముదుజ్ఝులను రెంటికి 'మఃఝు' అను సంజ్ఞ విధింపఁబడినది.

ఉదా:— నీవు దీర్ఘాయువు అగుము.
మీరు దీర్ఘాయులరగుఁడు.

## ముత్తు :

"ముజ్జిత్తులు ముత్తునాఁబడు"

అని సూరి లక్షణము. ముడుక్ లు—జిత్తులు ముత్తు సంజ్ఞకములగును. ఆశీశ్శాప సంప్రార్థన విధులందు మధ్యమ పురుష ప్రత్యయములగు వు-రులకు వచ్చిన ము-డుక్ లనునవియును, ఇకార మిత్తుగాఁగల జీ—పడుజీ—నుజీ—వుజీ మొదలుగాఁగల జీత్తులనునవియును కలిసి 'ముత్తు' అను సంజ్ఞకమైనది.

## విభక్తి :

"సుప్తిఙా విభక్తి సంజ్ఞాస్తః" అని పాణినీయము

విభక్తి యనునది యన్వర్థమగు సంజ్ఞ. విభజ్యతే ప్రకృత్యర్థః అనయా ఇతి విభక్తిః. ప్రకృతి యొక్క అర్థము సామాన్యముగా నుండును. అది ఈ ప్రత్యయము చేరఁగావిశేషరూపమున విభజింపఁబడును. అట్టివిభాగమునకు కారణమగుటచే ఈప్రత్యయములు విభక్తులనఁబడుచున్నవి. కడవ అనునది ప్రకృతి—ఇది 'కడవ' అను వ్యక్తిని మాత్రమే బోధించును. అంతియే కాని, కర్తయో కర్మమో, అధికరణమో అను అర్థములు విశేషించి బోధింపవు. ప్రత్యయములు చేరఁగా నర్థములు భాసించును. అట్లే వండు అను ధాతువు నుండి వంట అను క్రియ మాత్రమే భాసించును. డుజాదులు చేరఁగా కర్తృ కర్మ సంఖ్యా కాలములు భాసించును. ఇట్లే పాణినీయులు తద్ధితములలో గూడ కొన్ని

విభక్తి ప్రత్యయములు చేసియున్నారు. కాని అవి సార్థకములు కావు.

"స్వౌజ సమౌట్ఛస్ టాభ్యామ్భిస్జేభ్యామ్ భ్యస్ఙసి భ్యామ్భ్యస్ ఙసోసామ్ ఙ్యోస్సు" చిత్యేతాః క్రమాత్ జ్ఞేయా విభక్తయః" సుజౌజస్, అమ్, ఔట్, శస్, టాభ్యామ్భిస్, ఙేభ్యామ్భ్యస్, ఙసిభ్యామ్, భ్యస్, ఙస్ఓస్ఆమ్, ఙిఓస్సుప్" ఇవి సుప్పులు. తిప్, తస్ఝి, సిప్, థస్, థ, మిప్, వస్, మస్ ఇవి తిప్పులు. ఈ సుప్పులకు, తిఙులకు "విభక్తి" యని సంజ్ఞ.

దీనిని బట్టి తెలుఁగున ప్రాతిపదికములకు వచ్చు డు-ము-వు-లు, ని, ను, ల, కూర్చి, గుఱించి. చేత, చే, తోడ, తో, కొఱకు, కై—వలన—కంటె—పట్టి—కు—యొక్క— లోపల అందు—న—అను ప్రత్యయములు; సుబంత ప్రత్యయములు. అట్లే క్రియలకు వచ్చు 'డు(బువురునుముఙ్' అను ప్రత్యయములు తిఙ్ ప్రత్యయములు. ఈ రెంటికి కలిపి తెలుఁగున విభక్తి యని సంజ్ఞ. ఈ విభక్తి సంస్కృతము నందు వలె ఏడు విధములు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమీ అనునవి. ప్రథమా విభక్తిలో సంబోధన ప్రథమా విభక్తికలదు.

## జ్ఞాపకము :

"జ్ఞాపకసిద్ధంనసర్వత్ర"

అని పాణినీయము. జ్ఞాపక సిద్ధమైన కార్యము అన్ని చోట్ల ప్రవర్తింపక కొన్నిచోట్ల మాత్రమే వచ్చునని యర్థము. ఈ జ్ఞాపక ప్రసక్తిని చిన్నయ సూరి "నిర్జి నామంబులకయుగాగమంబు కలుగదు" అను సూత్రమున ప్రసంగించి నాఁడు. ఈ జ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్ష యందించుగాగమంబగునని యెఱుంగునది" అని సూరి వాక్యము.

సంస్కృత ధాతువులకించుగాగమంబు విధింపఁబడి నది కాని నామ ధాతువుల కెచట ఇంచుగాగమము ప్రాప్తిం చుటయే లేదు. ఇంచుక్ పరముగా నున్నగాని అయుక్ రాదు. ఇచ్చట ఇంచుక్ప్రాప్తియే లేనప్పటికి అయుగాగమ నిషేధమును కల్పించుటను బట్టి కొన్ని నామ ధాతువుల మీఁద గూడ ఇంచుగాగమము వచ్చునను విషయమును జ్ఞాపకము చేయుచున్నది కనుక నిది జ్ఞాపకసూత్రము.

ఇట్లు జ్ఞాపకసిద్ధమైన ఇంచుగాగమము కొన్ని నామ ధాతువులకు మాత్రమే వచ్చును.

ఉదా:— శయనించు-పయనించు

శయన-పయన నామధాతువులు; గనుక 'నిర్జినామంబుల కయుగాగంబు లేదు' అను సూత్రములోని అయుగాగ మనిషేధ జ్ఞాపకము వలన నామధాతువులైన వీనికి ఇంచుక్ వచ్చి శయనించు-పయనించు అయినవి.

## ధాతుజ విశేషణములు :

"ఎడి ప్రభృతి వర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు"— అని సూరి వచనము. ఈ ధాతుజ విశేషణములకు క్రియాజన్య విశేషణములని నామాంతరము. అనఁగా క్రియోత్పన్న విశేషణములని యర్థము. "ఉన్న-కలజీ-న-ని-ఎడి-ఎదు-తల్లోపము" ఇవి ఏడిటిని ధాతుజ విశేషణములుగా ప్రాచీనులు వ్యవహరించిరని పై వాక్య భావము. ఉన్న వర్ణకము సర్త మానార్థక శత్రర్థంబు నందు వచ్చును. కలజీ వర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబు నందగు. నవర్ణకంబుక్తవదర్థంబు నందగు "ఉన్న కలజీన వర్ణకంబులు భవద్భావి శతృక్తవదర్థములందగు"—అని సూరి లక్ష్యము. 'ని' వ్యతిరేకతృవర్ణకార్థమున వచ్చును. "తద్వ్యతిరేక తృవర్ణ కార్థంబునని జేయగు"—అని సూరి శాస్త్రము. "తృవర్ణకార్థము నందు ఎడి-ఎదు నన్నియలగు వానికి లోపంబు బహుళంబుగానగు" నని సూరి సూత్రములు.

ఉన్న:- వండుచున్నవాఁడు
కలజీ:- వండగలవాఁడు
న:- వండినవాఁడు
} ఈ 'మూఁడును సత్వాభిధానంబు నందగును.

ని:- వండని వాఁడు-వ్యతిరేక తృవర్ణకార్థమున వచ్చును.

ఎడి:- ప్రహరించెడి వాఁడు
ఎదు:- ప్రహరించెదువాఁడు
తల్లోపము:-ప్రహరించువాఁడు
(ఇట ఎడి-ఎదులలోపము)
} ఇవి తృవర్ణకార్థమున వచ్చును.

## స్త్రీసమము :

"స్త్రీ లింగంబుల ప్రథమైక వచనమునకు లోపంబగు"

అని సూరి సూత్రము. స్త్రీలింగ శబ్దములు తత్సమములగునపుడు ప్రథమైక వచనలోపము కల్గును. ఇవియే స్త్రీ సమములు. "ఆచ్ఛిక శబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీ సమంబులును క్లీబ సమంబులునయి యుండున"ని సూత్రించి వివరణమున స్త్రీసమత్వాతి దేశంబుచే ప్రథమైక వచనలోపాదికంబును—" అనినాఁడు. "ఒక పదార్థమందుంచఁబడిన ధర్మమును వేఱొక వస్తువునందు నిర్దేశించుట"ను అతిదేశ మందురు. ఇట స్త్రీ సమత్వాతి దేశము కల్గినది. అనఁగా స్త్రీ లింగములకు ప్రథమైక వచనలోపమను ధర్మమును ఆచ్ఛిక శబ్దములలో నిర్దేశింపఁబడినది. కాన ప్రథమైక వచన లోపము కల్గిన అచ్ఛ శబ్దములు స్త్రీ సమములు. స్త్రీ లింగ శబ్దములకు ప్రథమైక వచనము లోపించునట్లు వీనికిని ప్రథమైక వచనము లోపించుటచే స్త్రీ సమములను పేరు సార్థకము.

సంస్కృతమున కూడ ఇట్టివి కలవు. సంస్కృతమున ఒక్కొక్కపుడు ప్రకృతి – ప్రథమా విభక్త్యేక వచన రూపము ఒకటిగా నుండును. అపుడు ప్రథమా ప్రత్యయము వచ్చి లోపించుచుండును. అట్టిలోప సూత్రములు అవ్యయాదాప్సుపః, సుపోధాతు ప్రాతి పదికయోః— ఇత్యాదులు.

తెలుగు భాషలో ప్రాతిపదికము-ప్రథమావిభక్త్యేక వచన రూపము ఒక్కటిగాఁగల అన్న-అమ్మ-చెట్టు వంటి శబ్దములున్నవి. కనుకనే సంస్కృత మర్యాద ననుసరించి ప్రథమా ప్రత్యయము చేసి లోపము చెప్పుచుండిరి. అట్టి ప్రథమా విభక్తి లోపించిన అచ్ఛిక శబ్దములే స్త్రీ సమములని యర్థము. "ఇగ్లారా యుగంతముల ప్రథమైక వచనంబులకు లోపంబగు" - "స్త్రీలింగంబుల ప్రథమైక వచన లోపంబగు" ఇత్యాదులు.

'అచ్ఛికాః బహవః స్త్రీసమాః' అని సూత్రాంధ్ర వ్యాకరణము. అచ్ఛిక శబ్దములలో ఎక్కువగా స్త్రీ సమములు కలవని యర్థము. "అను దంత స్త్రీలింగంబునకు సర్వంబునకు స్త్రీ సమంబునకు సులోపంబగు"- నని శబ్ద లక్షణ సంగ్రహము.

ఉదా:- అన్న-మిన్న-అద్ద-గద్ద-జాణ-గాణ-ఓడ-గోడ ఇత్యాదులు స్త్రీ సమంబులు.

## క్లీబసమము :

"అచ్ఛిక శబ్దంబులెల్లందఱుచుగ స్త్రీ సమంబులుంగ్లీబ సమంబులు నయి యుండు-" నని సూరి సూత్రము.

"క్లీబ సమత్వాతి దేశంబుచే మువర్ణకంబగునని యెఱుంగు నది"—అని సూరి వివరణము.

క్లీబములన నపుంసక లింగములు. వీనిని తత్సమము లుగా చేయునపుడు ము వర్ణకము వచ్చును. అవి క్లీబ సమములని యర్థము. అతి దేశమన ఒక వస్తువు నందలి ధర్మమును అన్యవస్తువు నందు కల్గించుట. ఇట క్లీబముల ధర్మము కొన్ని ఆచ్ఛిక శబ్దములలో ఆరోపింపఁబడినది. కనుక ము ప్రత్యయాంతములగు అచ్చ తెనుఁగు శబ్దములు క్లీబ సమములు.

ఉదా:- బియ్యము-నెయ్యము-అల్లము-మొల్లము-సున్నము-సన్నము ఇత్యాదులు క్లీబసమంబులు ఇటు అచ్చ తెనుఁగు శబ్దములకు ము ప్రత్యయము వచ్చి సంస్కృత క్లీబములతో సమానత్వము నొందుటచే క్లీబ సమములైనవి.

"కేచన క్లీబసమాః" అని సూత్రాంధ్ర వ్యాకరణము. అచ్చ తెనుఁగు శబ్దములలో ఈ క్లీబసమములు అల్పముగా నున్నవి యని యర్థము.

## అలుక్సమాసము :

పూర్వ పదములోని ప్రత్యయము లోపింపని సమాసము అలుక్సమాసము. 'లుక్' అన లోపము. అలుక్కనఁగా లోపము లేనిదని యర్థము. ఈ సమాసమును సూరి సమాసములలో వచింపలేదు. అయినను లక్ష్యములఁబట్టి యూహింప వలయును. "చేత తోఁడవలనల కిత్వంబు సమాసంబులందగు"-"అంద్వాదుల కలిగాగమంబు సమాసంబు

లందగు" — ఈ రెండు సూత్రములు అలుక్సమాస విధాయకములు.

ఉదా:- నీ చేతన్+ప్రోవు=నీ చేతి ప్రోవు
నీ తోడన్+చెలిమి=నీ తోడి చెలిమి
నీ వలనన్+భయము=నీ వలని భయము
నాయందున్+కరుణ=నాయందలి కరుణ
నీ చేతి ప్రోవు అను తృతీయా తత్పురుష సమాసములో చేత అను ప్రత్యయములోపింపక దాని అత్యమున కిత్వము మాత్రము కల్గినది. కనుక అలుక్సమాసము. తక్కినవియు నిట్లే యూహ్యములు.

## ఆకృతిగణము :

"ప్రయోగ దర్శనేన ఆకృతి గ్రాహ్యోగణః ఆకృతిగణః"

ప్రయోగములను బట్టి ఆకృతులు గ్రహింపఁదగిన వాని సమూహము ఆకృతి గణము. లక్ష్యములఁబట్టి గాని, గణములోఁబఠింపఁబడు ఆది శబ్దమును బట్టిగాని కొన్ని శబ్దములను ఆగణములో చేర్పవచ్చును. ఆకృతిని బట్టిసిద్ధించు గణము కనుక ఆకృతి గణము.

ఉదా:- ఏమ్యాదులు—పచ్యాదులు—ఇఁకాదులు — పేర్యాదులు
అలుగ్వాదులు—మొ॥ నవి ఆకృతిగణములు.

## వళి:- ప్రాస :

"పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళి ప్రాసంబు లనాఁబడు"

నని సూరి లక్షణము. పద్య పాదములోని మొదటి యక్షరము వళియనియు—ద్వితీయాక్షరము ప్రాసయనియు అర్థము "పాదాద్యక్షరం వళిః ద్వితీయం ప్రాసః" అని "సూత్రాంధ్ర వ్యాకరణము".

"పాదమందు మొదలి వర్ణంబు వళియయ్యె నవలి ప్రాయి ప్రాస మనఁగ నొప్పుఁ బ్రాసమొక్కఁడన్ని పాదంబులను వళి స్వస్వపాద నియతి వఊలుశౌరి"అని "పద్యాంధ్ర వ్యాకరణము"న విశదీకరించెను. పద్యమన్ని పాదములలో ప్రాసాక్షర మొక్కటిగ ఉండ వలయుననియు, వళి ఆయా పాద నియతిసిబట్టి యుండుననియు భావము. ఇఁక శబ్దలక్షణ సంగ్రహమున "పాదంబు నందాద్యక్షరంబువళి"—"ఇయ్యది యేని దీనిమిత్రంజేని యతిస్థానంబు మీఁదంబ్రయోజ్యంబు"

ద్వితీయంబు ప్రాసంబు:— "ఈ యది సర్వపాదంబుల నొక్కండగు"— ఖండ పూర్వ తదన్యంబు లొండొంటికిం జెల్లవు" అని సూత్రీకరించెను. ఇట ఖండమునకు అఖండమునకు ప్రాస చెల్లదని పై వాని కంటె విశిష్టముగా చెప్పినాఁడు.

ఆద్యోవళిః ద్వితీయోవర్ణః ప్రాసోఽత్రపాదపాదేషు స్వస్వ చరణేషు పూర్వః ప్రాసస్స్వేషు చైక ఏవస్యాత్" అని చింతామణి.

పాద ప్రథమాక్షరము వళి. ఆయావృత్తి లక్షణ

ములఁ బట్టి ఆయా పాదములలో యతిస్థానము నిర్దేశమగును. అట్లు నిర్దిష్టమైన యతిస్థానమున ప్రథమాక్షరముగాని, తన్మైత్రాక్షరముగాని ఉండవలెను. విరతి-విశ్రాంతి-విశ్రామ విశ్రమ-శ్రాంతి-విరమణ-విరమ-విరామ'- యని వళికి పర్యాయ పదములు. ఇవి అన్నియు 'నియమిత స్థలమున విశ్రమించునవి' అను నర్థమున ఉపపాదితములు. యతి అనునది యమ-ఉపరమే అను ధాతూత్పన్నము. సంస్కృతమున యతి స్థలమున పదవిచ్ఛేదము కల్గును. పదచ్ఛేదము కలుగకున్న 'యతి భంగదోషము కల్గును'. 'యతిర్విచ్ఛేద సంజ్ఞకః' అని వృత్తరత్నాకరము.

ఈ యతిని తెలుఁగున 'వళి' అందరు. ఈ 'వళి' కి నిర్వచనములనిట్లు చెప్పిరి- 'చరణాద్యక్షరమే వడి.-' యని కవిజనాశ్రయకర్త, "పాద ప్రథమాక్షర ము త్పాదితమగు వళి యనంగ' అని కావ్యాలంకార చూడామణి కర్త" వాసన గల మొదలి వ్రాయి వడియనఁబరగున్"-అని ఛందో దర్పణకర్త; చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె నని-అప్పకవి వచించిరి. ఈ వళికి వడి యని రూపాంతరము.

ఉదా.— మును మదు పజ్ఞంబగుచుం
దన రిన వ్యాకృతిని సూత్రతతినొక కొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధమగు భంగిఁదగన్

"ద" 'త' లకు చెల్లుటయే వర్గయతి.

పాదములోని ద్వితీయాక్షరమును ప్రాసమందురు. ఈ ప్రాస మన్ని పాదములలో ఒక రీతిగనే యుండును. మొదటిపాదమున ద్వితీయాక్షర మేదియున్న తక్కిన మూఁడు పాదములలోఁగూడ అదేఅక్షర ముండవలెను. వీనికి హల్సామ్యమున్న చాలును. స్వర సామ్యమవసరము లేదు. ప్రాస పూర్వాక్షరము గురువైన తక్కిన పాదములలోని మొదటి యక్షరము గురువుగానే యుండవలెను. అట్లే, లఘువున్న లఘువుగను, సంయుక్తాక్షరమున్న సంయుక్తాక్షరముగను, పూర్ణార్ధ బిందువులున్న పూర్ణార్ధబిందువులుగను నుండవలయును.

ఉదా:— "తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందిన వారల్
తనరఁగని వ్యాకరణం
బున మూలంబయిన కృతిని బోలఁగనఁదగున్"

ఈ కంద పద్యమున నాలుగు పాదములలో 'న' అను ప్రాసాక్షరము కలదు. ఈ ప్రాసమునకు హల్సామ్యమే గాని స్వర సామ్యమవసరము లేదు. కాఁబట్టి మొదటి పాదమున 'ను' ఉన్నను ఎట్టి బాధలేదు. ప్రాసాక్షరము కంటె ముందు అన్ని పాదములలోను లఘువేఉన్నది.

సంపూర్ణము

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 4 | అనక్ళవతి | అవ్యక్ళవతి |
| 6 | 1 | వర్ణయుగక్షరములు | వర్గయుగక్షరములు |
| 9 | 13 | అఆఇఈఒఓలంగూడిన | అఆఇఈఒఓఔలంగూడిన |
| 14 | 16 | అనుశబ్దార్థ చింతామణి | అనిశబ్దార్థ చింతామణి |
| 23 | 10 | ఎకృతంబు | వికృతంబు |
| 31 | 11_17 | బహుళకం | బాహుళకం |
| 39 | 8 | విభక్తంతము | విభక్త్యంతము |
| 40 | 10 | అమద్వత్ | అమహద్వత్ |
|  | 14 | స్త్రీలను | త్రిలను |
| 41 | 8 | నిశ్చలనము | నిశ్చలము |
| 42 | 5 | కొనిఎంచు | కానిపించు |
|  | 10 | అంతానయముగా | అంతావయవముగా |
| 43 | 1 | కూచకము | సూచకము |
| 46 | 2 | గ్రావచ్చు. | గావచ్చు |
| 59 | 2 | పాణినీయలు | పాణినీయులు |
|  |  | కర్మ | కర్మము |
| 69 | 15 | శబములు | శబ్దములు |
| 69 | 19 | పరస్వరాన్వయః | పరస్పరాన్వయః |
| 70 | 1 | స్వరాన్వయము | స్పరాన్వయము |
| 76 | 15 | పాణినీయు | పాణినీయులు |
| 77 | 13 | విశిష్టైకార్థః | విశిష్టైకార్థః |
|  | 16 | సీమూహర్ధము | సమూహార్ధము |
| 80 | 3 | లక్షణికము | లాక్షణికము |
|  | 7 | లాక్షణికావ్యములు | లాక్షణికావ్యయములు |
|  | 14 | గణఫలిత | గణపఠిత |
| 81 | 5 | అన్వయము | అవ్యయము |

| పేజి | పం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 81 | | పోయిన | పోయినను |
| 82 | 3 | కలదియును | కలదియను |
| | 4 | అస్త్యస్మిన్నితి | తదస్యాస్త్యస్మిన్నితి |
| | 12 | వైయాకరణుడనియు | వైయాకరణుడు కాడనియు |
| 83 | 14 | అస్త్వస్మిన్నితి | అస్త్యస్మిన్నితి |
| | 18 | మతుప్రత్యయము | మతుప్ప్రత్యయము |
| 85 | 3 | ఉత్పాదకమైన | ఉత్పాదకమైనది |
| 86 | 3 | తను | తన |
| 86 | 3 | సంపూర్ణమను | సంపూర్ణమగు |
| 87 | 15 | ముగింపుకున్నందున | ముగింపకున్నందున |
| 93 | 3 | తుమున్ణ్వులే | తుమున్ణ్వులౌ |
| 94 | 12 | తజానావాత్మనేపదమ్ | తజానామాత్మనేపదమ్ |
| 96 | 16 | క్రియన్స్ఫురించిన | క్రియన్స్ఫూరించివ |
| | 18 | ఉండవలెను | ఉండును |
| 97 | 13 | తృజర్థమున | తృజర్థమన |
| 105 | 14 | భిన్నములమహత్తులని | భిన్నములుమహత్తులవి |
| 106 | 3 | దుమంత్తము | దుమంతము; |
| 109 | 9 | లూణ్మధ్యమ్మపురుషులకు | లూణ్మధ్యమపురులకు |
| 110 | 7 | ఘుప్తి జౌ | సుప్తి జౌ |
| 111 | 5 | సు[illegible]జస్ | సుబౌజస్ |
| | 6 | జఓస్ సుప్ | జిఓస్ సుప్ |
| 113 | 12 | తవ్యతిరేక | వ్యతిరేక |
| 119 | 11 | అందెదు | అందురు |



ఈ సంజ్ఞ 47–48 పుటలలో కొలది మార్పులతో పునరుక్తమైనది

